Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు   స్థాపితం: 1930   జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 9 • 1-3-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-




● వైకాపాలో ముఠా కుమ్ములాటలతో...

# జగన్‌కు జైలులోనూ ప్రశాంతత లేదు!



వైఎస్ జగన్ పరిస్థితి చెంప దెబ్బ గోడ దెబ్బ అన్నట్లు మారుతున్నది. ఒక పక్క సిబిఐ వేధింపులతో, కోర్టు కేసులతో, బెయిల్ దొరకని నైరాశ్యంలో కృంగి పోతుంటే మరొక ప్రక్క తన స్వంత పార్టీలో ముఠా కుమ్ములాటలు మనసుకు ప్రశాంతత లేకుండా చేస్తున్నాయి. వరంగల్, నెల్లూరు, ఖమ్మం, తూర్పు గోదావరి, విశాఖపట్నం, కర్నూలు, అనంతపురం వంటి జిల్లాలన్నింటిలో జగన్ పార్టీ మూడు ముక్కలు ఆరు చెక్కలుగా చిందరవందర అయి పోతున్నది. ఖమ్మం జిల్లాలో జలగం వెంగళరావు కుమారుడు వెంకటరావు ఒక పక్క, పువ్వాడ నాగేశ్వరరావు కుమారుడు అజయ్ కుమార్ మరొక పక్క చేరి వీధి పోరాటాలు చేస్తున్నారు. ఎంత చెప్పినా వారు మాట వినడం లేదు. విశాఖపట్నంలో కొణతాల రామకృష్ణ, సబ్బం హరి రెండు వర్గాలుగా చీలి పోయారు. ఒకరి సభలను మరొకరు భగ్నం చేసుకొంటున్నారు. ప్రత్యక్ష దాడులకు దిగుతున్నారు. వరంగల్ జిల్లాలో కొండా మురళి, సురేఖ దంపతులతో జగన్‌కు విపరీతమైన తలపోటు వస్తున్నది. జగన్ కోసం మంత్రి పదవి వదలుకొని వచ్చిన త్యాగశీలి కొండా సురేఖ. దాన్ని ఆసరాగా తీసుకొని తన జిల్లాలో తన మాటే చెల్లుబాటు కావాలని పట్టు బడుతున్నాడు కొండా మురళి. ఖమ్మం పార్లమెంటు సీటు తనకివ్వాలని అది వీలు కాకుంటే భూపాలపల్లి ఎమ్మెల్యేగా పోటీ చేస్తానని పట్టు బడుతున్నాడు. అయితే ఒకే కుటుంబం నుంచి రెండు సీట్లు ఇవ్వడానికి జగన్‌కు కష్టంగా మారుతున్నది. సీట్ల కోసం పోటీపడే వందలాది మందిని సర్దుబాటు చేయలేక ఇబ్బంది పడుతుంటే ఒకే ఇంట్లో ఇద్దరిని ఎట్లా సమర్థించగలడు పాపం?

కర్నూలు జిల్లాలో భూమా నాగిరెడ్డి దంపతులతోనూ అదే సమస్య. ఒక్క కర్నూలు జిల్లాయే కాదు, మొత్తం రాయలసీమలోనే తన మాట చెల్లాలని హఠం పడుతున్నారు వారు. తూర్పు గోదావరి జిల్లాలలో పిల్లి సుభాష్‌చంద్రబోస్ లేనిపోని సమస్యలు సృష్టిస్తున్నాడు. అమలాపురం ఎమ్పీ హర్ష కుమార్‌ను ఎట్లైనా ఓడించాలని తగిన అభ్యర్థి కోసం చాలా కాలం వెతుకులాడాడు జగన్. ఎవరూ దొరకలేదు. దానితో నిర్మలకుమారి అనే మహిళను ముందుకు తెచ్చాడు. అయితే ఆమె పని తీరు బాగా లేదు. దానితో ప్రస్తుతం కిరణ్‌కుమార్‌రెడ్డి క్యాబినెట్‌లో మంత్రిగా వున్న పిన్నేపి విశ్వరూప్‌తో రాయబేరాలు జరిపారు. తన కుమారుడి పెళ్లి తర్వాత మంత్రి పదవికి రాజీనామా చేసి పార్టీలో చేరిపోతానని, అమలాపురం స్థానం నుంచి ఎమ్పీగా పోటీ చేస్తానని పిన్నేపి విశ్వరూప్ ముందుకు వచ్చాడు. ఆ ప్రతిపాదనకు పిల్లి సుభాష్‌చంద్రబోస్ అడ్డం పడుతున్నాడు. వారిద్దరికీ సరిపడదు.

నెల్లూరు జిల్లాలో సహకార ఎన్నికలలో తన పార్టీకి కేవలం 7 సొసైటీలు మాత్రమే దక్కడం జిల్లాలోని ముఠా కుమ్ములాటల ఫలితమే అని జగన్ భావిస్తున్నాడు. ఒంగోలు, కడపల వలె నెల్లూరు జిల్లాలో కూడా పార్టీ పటిష్టంగా వుంది. కానీ నేతలనుకున్న మేకపాటి రాజమోహన్‌రెడ్డి, కాకాణి గోవర్ధన్‌రెడ్డిలకు ఒద్దికలేక, బ్యాంక్ అధ్యక్ష పదవికి ఒక అభ్యర్థిని కూడా పెట్టలేక పోయారు. దానితో గ్రామాలలో రైతాంగం జగన్ మీద అంత ప్రేమగా లేరన్న దురభిప్రాయం కల్గడానికి ఆస్కారం ఏర్పడింది. మరీ ముఖ్యంగా ఉదయగిరి నియోజకవర్గంలో మేకపాటి స్వంత గ్రామంలో కూడా తన పార్టీ ఓడి పోవడం జగన్‌ను బాగా ఆలోచింపచేస్తున్నది.

మొత్తం మీద రాష్ట్రంలో పార్టీ పరిస్థితి అదుపు తప్పిపోతున్నాదని ఆందోళన చెందుతున్నాడు జగన్.

కొరవ 14వ పేజీలో

## మేకపాటికి గృహ హింస!



నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి చిత్రమైన సమస్యలో చిక్కుకొన్నాడు. ఆయనకు నెల్లూరులో ఇల్లు లేదు. పొదలకూరురోడ్డులో కొత్తగా కడుతున్న భూరి భవంతి ఇంకా సిద్ధం కాలేదు. ఎమ్పీగా పోటీ అనుకొన్న తర్వాత, నెల్లూరులోని తన బావమరిది దశరథరామరెడ్డి ఇంట్లో తాత్కాలిక బస ఏర్పాటు చేసుకొన్నాడు. దశరథరామరెడ్డికి వెంకటగిరి ఎమ్మెల్యేగా పోటీ చేయాలని మహా కుతూహలం. కానీ అక్కడ కొమ్మి లక్ష్మయ్య నాయుడును ప్రతిపాదించాడు వైఎస్.జగన్. దాన్ని అడ్డుకోమని రాజమోహన్‌రెడ్డి చెవిలో ఇల్లు కట్టుకొని పోరుతున్నాడట దశరథరామరెడ్డి. కానీ జగన్ మనసు మారలేదు. మొన్న 15తేది లక్ష్మయ్య నాయుడు పెంచలకోనలో పూజ చేసి వెంకటగిరి రాజకీయ ఆరగేట్రం చేశాడు. దానికి మేకపాటి కూడా వెళ్లవలసి వచ్చింది. నువ్వు పోవడానికి లేదని అడ్డం పడ్డాడట బావమరిది. ఆ ఒత్తిడి తట్టుకోలేక మేకపాటి రాజమోహన్‌రెడ్డి అప్పటికప్పుడు ఇల్లు ఖాళీ చేసి, తన తమ్ముడి అతిథి గృహానికి మారిపోయాడు. రాజకీయాలలో ఇటువంటి గృహహింసలు ఎదురుకావడం రాజమోహన్‌రెడ్డికి కొత్త.

## వివేకా కోలుకొన్నాడు!



నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి బాగా కోలుకొన్నాడు. మళ్లీ మెల్లగా నడక కూడా మొదలు పెట్టాడు. ముఖం బాగా తేట పడింది. మాటలో పాత పదును కన్పిస్తున్నది.

వివేకా జీవితంలో ఇదొక చేదు అనుభవం. చీకటి అధ్యాయం. జీవిత గమనం గురించి ఆత్మ విమర్శ చేసుకొనే అవకాశం. ఆరోగ్యం మెరుగు పరచుకోవడంతోపాటు మనసులోని కల్మషం కూడా కడిగి వేసుకొని తేటంగా తిరిగి రావాలని కోరుకొంటున్నాము.

# దారుణం

తీవ్రవాదానికి మతం లేదు; కులం లేదు; జాతి లేదు; ప్రాంతం లేదు. అదొక రాక్షసత్వం. రక్తం త్రాగి ఆనందించే పైశాచికత్వం. వారి లక్ష్యం భీతావహం సృష్టించడం మాత్రమే. దానివల్ల తమకొరిగేది ఏదీ లేదని తెలుసు. కానీ అందుకోసం అమాయక ప్రాణాలను కర్కశంగా బలి తీసుకొంటూనే వుంటారు. రాక్షస ఆనందం పొందుతూ వుంటారు.

మొన్న హైదరాబాదు నగరంలోని దిల్‌షుక్‌నగర్‌లో జరిగిన జంట బాంబు పేలుళ్లు దారుణాతి దారుణమైనవి. ఏ పాపం ఎరుగని అమాయక జనం మీద తమ దానవత్వం ప్రదర్శించారు తీవ్రవాద ముష్కరులు. జనం బాగా గుమికూడే చోటు చూసి బాంబులు పెట్టి, 30 మందిని చంపారు. మరొక వంద మంది వరకు కాళ్లు కోల్పోయి, చెవుడు వచ్చి, కళ్లు పోగొట్టుకొని, వెన్నుపూస ముక్కలై, కడుపులోని పేగులు బయటపడి నానా రకాలుగా చిత్ర హింస అనుభవించారు. డాక్టర్ల పుణ్యాన బ్రతికినా జీవితకాలం వారు అనుభవించే బాధ, నరకతుల్య హింస, మానసిక ఒత్తిడి తలచుకొంటే గుండె నీరై పోతున్నది.

పార్లమెంటు మీద దాడి చేయించింది అఫ్జల్‌గురు. అతడికి ఉరి శిక్ష వేసింది న్యాయస్థానం. దాన్ని ధృవపరచింది రాష్ట్రపతి. ఆ నిర్ణయాన్ని అమలు చేసింది కేంద్ర ప్రభుత్వం. కానీ తీవ్రవాదులు ప్రతీకారం తీసుకొన్నది మాత్రం అన్నెం పున్నెం తెలియని జనం మీద. అందులోనూ దాడికి బలైనవారంతా నిరుపేద ప్రజలు.

అఫ్జల్‌గురు ఉరికి ప్రతీకారంగా ఏదో ఒక దారుణం జరగవచ్చునని నిఘా వర్గాలకు సమాచారం వుంది. దాన్ని రాష్ట్ర ప్రభుత్వానికి అందజేశారు. కానీ ప్రభుత్వం, పోలీసు యంత్రాంగం మాత్రం నిమ్మకు నీరెత్తినట్లు వుండిపోయింది. దిల్‌షుక్‌నగర్, బేగం బజార్ వంటి ప్రాంతాలు తీవ్రవాదుల గురిలో వున్నాయన్న నిజం తెలిసి కూడా పూరకుండిపోయారు. పోలీసు అప్రమత్తంగా వుంటే తీవ్రవాదులు ఇంతకు తెగించలేరు. మన ప్రభుత్వాలకు ప్రజల ప్రాణాలంటే గడ్డిపోచతో సమానం. ఏదో ఒక ఉపద్రవం జరిగినప్పుడు విచారం వ్యక్తం చేయడం, బుడి బుడి కన్నీరు కార్చడం తప్ప దాడుల నివారణకు జాగ్రత్తపడిన దాఖలాలు లేదు. గత పదేళ్లలో ఆఫ్ఘనిస్తాన్‌ను మినహాయిస్తే తీవ్రవాదం వల్ల ప్రపంచ వ్యాప్తంగా జరిగిన మరణాల సంఖ్య కంటే ఒక్క భారత దేశంలో జరిగిన చావులు ఎక్కువని అమెరికన్ సర్వే నివేదిక తెలుపుతున్నది. దాన్నిబట్టే తీవ్రవాదం పట్ల మన నేతలు ఎంత నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారో అర్థం అవుతుంది. నేతలు, ఉన్నతాధికారులను కాపాడుకోవడానికి వందలు, వేలాది మంది పోలీసు బలగాలను వాడుకోవడం తప్ప ప్రజల ప్రాణాలను రక్షించే బాధ్యత తమ మీద వుందన్న నిజాన్ని అందరూ విస్మరిస్తున్నారు.

తీవ్రవాదుల పట్ల మెతక వైఖరి కూడా మన పాలకుల లోని పెద్ద లోపం. ఒక హత్య కేసులో జీవిత శిక్షపడిన సయ్యద్ మక్బూల్‌కు వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ప్రభుత్వం క్షమాభిక్ష ప్రసాదించింది. తనకు బాగా కావాల్సిన ఫ్యాక్షన్ నేతలను జైలు నుంచి బయటకు తేవడానికి ఇటువంటి తీవ్రవాదులను కూడా వదలి పెట్టాడు వైఎస్. బయటకు వచ్చిన మక్బూల్ పూనా నగరంలో బాంబు పేలుళ్లకు పాల్పడ్డాడు. ఇప్పుడు దిల్‌షుక్‌నగర్‌లో జరిగిన ఘాతుకానికి కూడా ప్రణాళిక అతడిదేనట. మూడేళ్ల క్రితమే అక్కడ సంచరించి, బాంబు పెట్టడానికి అనువైన ప్రదేశం ఏదో గుర్తించింది మక్బూల్ అని తెలుస్తున్నది.

జమీన్‌రైతు

తీవ్రవాదుల పాలిట జైళ్లు స్వర్గధామాలుగా మారడం మరొక ఘోరమైన నేరం. జైలు లోపల వారికి టెలిఫోన్, ఇంటర్నెట్ వంటి సౌకర్యాలు సులభంగా అందుబాటులోకి వస్తున్నాయి. వాటి ఆసరాతో తమ పైశాచిక కార్యకలాపాలకు జైలు లోపల నుంచే ప్రణాళికలు రచిస్తున్నారు. బయట వున్న తీవ్రవాదులను అవసరమైనప్పుడల్లా జైలుకు పిలిపించి సమావేశాలు జరుపుతున్నారు. చిల్లర డబ్బులకు కక్కుర్తిపడే జైలర్లు, వార్డర్లు దేశానికి చేస్తున్న తీరని అపకారం ఇది.

తీవ్రవాదం ఒక పెనుభూతం వంటిది. దాన్ని అణిచివేయడంలో ఎంత కఠినంగా వ్యవహరించినా ఫర్వాలేదు. పోలీసు, జైలు వ్యవస్థలను ఇందుకు సన్నద్ధం చేయడంలో ప్రభుత్వాలు విఫలమవడం వల్లనే తీవ్రవాదులు రెచ్చి పోతున్నారు. అనుకొన్నప్పుడల్లా తమ క్రూరత్వాన్ని జనం మీద ప్రదర్శించి చూపుతున్నారు. ప్రభుత్వాలు ఇప్పటికైనా కళ్లు తెరిస్తేనే ప్రజల ప్రాణాలకు భద్రత.

# జనవాణి

## ఇంతియాజ్ బృందాన్ని ఉరి తీయాలి!

మహిళల మీద అత్యాచారాలు రానురాను పెరిగిపోతున్నాయి. నెల్లూరు హరనాథపురంలో జరిగిన తల్లీకూతుళ్ల హత్యోదంతం టీవీల్లో చూసి, పత్రికల్లో చదివిన తర్వాత మనసు ఎంతగానో బాధపడింది. సమాజానికి ఎంతో ఉపయోగపడాల్సిన ఒక డాక్టర్‌ను ఆమె తల్లిని కేవలం డబ్బుకోసం ఇంతియాజ్ అతని మిత్రబృందం చంపివేయడం దారుణం. ఈ హంతకులు ముగ్గురికీ నెల్లూరు ప్రజలు చూస్తుండగానే గాంధీబొమ్మ సెంటర్‌లో బహిరంగ ఉరిశిక్ష వేయాలి. అప్పుడుగాని ఇటువంటి దారుణానికి ఒడిగట్టను ఇతరులు భయపడతారు. కోర్టులు, విచారణ అని తిప్పకుండా తక్షణం ఉరిశిక్ష అమలు చేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

సి.సుజాత — కర్నూల్

## దొంగతనాలు ఆపండి!

నెల్లూరు నగరంతోపాటు జిల్లాలోని పలు ప్రాంతాల్లో దొంగతనాలు యదేచ్ఛగా జరుగుతున్నాయి. పగలు రాత్రి తేడా లేకుండా జరుగుతున్న ఈ దొంగతనాలకు జనం ఇల్లు వదలిరావాలంటే భయపడిపోతున్నారు. బాలాజీనగర్ ప్రాంతంలో చైన్‌స్నాచింగ్స్ ఆగడమే లేదు. జిల్లాలో దొంగతనాలు ఆపను పోలీసులు ఓ కార్యచరణ పథకాన్ని రూపొందించమనవి.

ఎస్వీఎస్ కోటేశ్వరరావు — నెల్లూరు

## ప్రణబ్ ముఖర్జీ పనితీరు బాగుంది!

జాతీయవాదులు, దేశభక్తులు, క్రీడాకారులు, ఆదర్శనాయకులకు పశ్చిమ బెంగాల్ రాష్ట్రం పుట్టినిల్లు. సుబాష్‌చంద్రబోస్, రవీంద్రనాథ్ ఠాగూర్, వివేకానందుడు, జ్యోతిబసు, ప్రణబ్ ముఖర్జీ వంటి వారు బెంగాల్‌లోనే పుట్టారు. కాంగ్రెస్ పార్టీ రాజకీయాల్లో ప్రణబ్ ముఖర్జీ చాణక్యుని మరిపించారు. రాష్ట్రపతిగా బాధ్యతలు స్వీకరించాక రబ్బరుస్టాంప్ ముద్రను తీసి ప్రక్కన పెట్టి ప్రళయ ముఖర్జీ అవతారమెత్తి కసబ్, అఫ్జల్ గురు వంటి తీవ్రవాదులకు క్షమాభిక్ష రద్దు చేశారు. గంధపుచెక్కల స్మగ్లర్లు ఐదుమందిని ఉరిశిక్షకు అర్హులను చేశారు. భారతదేశంలో తీవ్ర నేరాలు చేస్తే ఉరిశిక్ష తప్పదని రాష్ట్రపతి తనదైన శైలిలో చెప్పడం హర్షణీయం.

వాస్తు రామచంద్ర — నెల్లూరు

## ఆకట్టుకొన్న క్రీడా సంబరం!

నెల్లూరులో హ్యాండ్‌బాల్ జాతీయస్థాయి పోటీలు ఆరు రోజులు రోజా చూచి ఆనందించాను. ఆటలంటే నాకు ఎంతో ఇష్టం. మా రోజుల్లో చదువుల్లో మార్కులకన్నా ఆటల్లో పాల్గొనే విద్యార్థులకు ప్రాముఖ్యమెక్కువ. వాళ్లంటే స్కూల్లో

కొరవ 14వ పేజీలో

# 70 ఏళ్ల క్రితం ఈవారం

**5-3-1943**
**పేజీలు : 4 వెల: 0-1-0**

## వ్రతానంతరం

సర్వేశ్వరుని కృప వల్ల నిర్విఘ్నంగా నిజ ఆత్మ పరీక్షాయుతమైన ప్రాయోపవేశన దీక్షను ముగించుకొని గాంధీ మహాత్ముడు నిండా కళంకాన్ని విశ్వనాయక స్థానంలో బావుకొని బయటపడినాడు. జానకీదేవి అగ్ని ప్రవేశమై పవిత్ర భూతయై రాణించిన పుణ్య దినము వంటిదే ఈ 3వ తేది. ఇంకను ప్రభుత్వము శంకను వీడలేకున్నా అది గాంధీజీ బాధ్యత గాదు. రాజకీయ దృష్టిలో ప్రభుత్వానికి లాభదాయకం కానేరదేమో!

స్థితప్రజ్ఞునికి అలివిగానిది లేదు. బృహత్‌నాడీ గ్రంథంలో గాంధీజీ గ్రహ కూటానుగుణ్యంగా నడవడుగానీ, ఆ గ్రహలే ఆయన సంకల్పానుగుణ్యంగా స్థానాలు మార్చుకొంటవి అని వ్రాసిన వ్రాత సత్యం అని నేటికి ధృవపడింది అనాల. లేకుంటే దినదినానికి క్రుంగవలసిన పంచు దేహం ఉత్తేజకరమై ఉల్లాసపు వెల్లువలో తేలి పోతుండింది అంటే దైవికశక్తి ఆత్మశక్తి మూలంగా వ్రతాన్ని నడిపింది అనాల. ఎట్లనైతేనేమి మన బాపూజీ మనకు దక్కినాడు. భారతమాత – భారత ప్రజ ధన్యము. ఈ మహత్తర యుగంలో ఉన్న మనస్ఫురణ ఏ వ్యక్తిని పులకితము చేయదు?

## మంత్రుల అధికారం

మంత్రులకు వైశ్రాయి సభ సభ్యులకు అధికారం లేదని పదే పదే వెల్లడైనా, తమకు కావలసినప్పుడు అమెరీ ప్రభుతులు హైందవులే పాలిస్తున్నారనే బూరుగకు వీరిప్పుడు శ్రుతి వేయడం రాజకీయం కానేరదు.

వైశ్రాయి సభలో 9 మంది హైందవులుండేది నిజమే. వారి మాట ఎంత సాగుతున్నది? గాంధీ వైశ్రాయి ఉత్తర ప్రత్యుత్తరాలు చూడనోచుకోలేదు. నాయకులు ఎక్కడుండేది విన నోచుకోలేదు.

# 50 ఏళ్ల క్రితం ఈవారం

**1-3-1963**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

## రాజర్షి రాజేంద్రప్రసాద్ అస్తమయం

గాంధీజీ మరణానంతరం భారత జాతికి యింతటి విషాదం జరుగలేదు. రాజేంద్రప్రసాద్ హఠాత్తుగా నిమోనియా వ్యాధిగ్రస్తులై 28వ తేది రాత్రి 9.10 గంటలకు ప్రశాంతంగా కన్నుమూశారు. వారు నిన్న 28వ తేది సాయంకాలం పాట్నా విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసం చేయవలసి వుండెను. కానీ అనారోగ్యం వల్ల వారు పోజాలక, వారి బదులు వారి ఉపన్యాసం మాత్రం చదువబడింది. రాజెన్‌బాబు మృతదేహాన్ని తొట్ట తొలుత దర్శించి అంజలి ఘటించిన వారు హోం మంత్రి లాల్‌బహదూర్ శాస్త్రి, బీహారు గవర్నరు అనంత శయనం అయ్యంగార్, ముఖ్యమంత్రి వినోదానంద్ ఝూ ప్రభృతులు. వారి అంత్యక్రియలు ఈ రోజు రాజ లాంఛనాలతో జరుగుతవి. రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ గారు గూడా హాజరవుతారు. దివంగతుడైన మహా నాయకుని ఆత్మశాంతికి ఈ రోజు ప్రభుత్వ శలవు దినంగా ప్రకటింపబడింది. ఏడు రోజులు సంతాప దినాలుగా గూడా పరిగణింపబడగలవు. ఈ సమయంలో అధికార విందులు, వినోదాలు వుండవు.

## నెల్లూరు
## వైస్ ఛైర్మన్‌గా పి.వి

గత 25వ తేది జరిగిన నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్ ప్రత్యేక సమావేశంలో పి.వి.సుబ్బారెడ్డి గారు వైస్ ఛైర్మన్‌గాను, ఆర్.సి.చంగయ్యా గారు అపాయింట్‌మెంట్ కమిటీ సభ్యుడుగాను ఏకగ్రీవంగా ఎన్నుకోబడినారు. ఈ సమావేశానికి ఛైర్మన్ పేరూరు లక్ష్మణగుప్త అధ్యక్షత వహించారు. హైదరాబాద్‌కు పోయి ఉండిన పి.వి. సుబ్బారెడ్డి ఆనాటి సమావేశానికి హాజరు కాలేదు. ఈ ఎన్నిక వారి పరోక్షంలో జరగడం విశేషం. నెల్లూరు మునిసిపల్ చరిత్రలోనే ఇది అపూర్వమైన సన్నివేశం.

# నెల్లూరు ముచ్చట్లు

## సాదాసీదాగా రాష్ట్రపతి!

25వ తేది శ్రీహరికోటలో జరిగిన పిఎస్ఎల్వీసి–20 రాకెట్ ప్రయోగ వీక్షణకు విచ్చేసిన దేశ ప్రథమపౌరుడైన రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీ సాదాసీదాగా మిషన్ కంట్రోల్ రూమ్ తరలి రావడం చూసిన శాస్త్రజ్ఞులు విస్తుపోయారు. ఢిల్లీ నుంచి శ్రీహరికోటకు బ్లూ రంగు సూట్‌లో వచ్చిన ప్రణబ్‌ముఖర్జీ భాస్కర అతిథి గృహంలో విశ్రాంతి తీసుకొన్నారో లేదో తెలియదు కానీ అదే సూట్‌లో తల కూడా దువ్వుకోకుండా తనకు ప్రత్యేకించిన సీటులో వచ్చి కూర్చొన్నారు. మామూలుగా సీరియస్‌గా కనిపించే దాదా పైకెగిరిన రాకెట్ వివిధ దశల్లో విజయవంతం కావడం చూస్తూ ముసి ముసి నవ్వులు రువ్వారు.

## సిఎంకు దొరికిన ఛాన్స్!

రాష్ట్రపతితో చాలాసేపు వివిధ అంశాలపై మాట్లాడే ఛాన్స్ సిఎం కిరణ్ కుమార్‌రెడ్డికి శ్రీహరికోట పర్యటనలో దక్కింది. రాష్ట్రపతి చెన్నై నుంచి శ్రీహరికోటకు రాను హెలికాప్టర్ ఎక్కింది మొదలు తిరిగి వెళ్లే వరకు ముఖ్యమంత్రి, ప్రణబ్‌ముఖర్జీ వెనుకే ఉండినారు. ఇటువంటి ఛాన్స్ అరుదుగా గానీ ముఖ్యమంత్రులకు దక్కదని పలువురు వ్యాఖ్యానించడం కనిపించింది. దీన్ని కిరణ్ కుమార్‌రెడ్డి తనకు అనుకూలంగా మలచుకొని ఉంటాడంటున్నారు.

## ఆప్కాబ్ ఛైర్మన్‌గా నెల్లూరీయుడు!

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంక్ అధ్యక్షునిగా నెల్లూరీయుడు కొల్లు కుదురు వీరారెడ్డి బాధ్యతలు చేపట్టారు. ఈయన మహబూబ్‌నగర్ జిల్లావాసిగా అందరూ భావిస్తుంటారు. తండ్రి వెంకారెడ్డితోపాటు వీరారెడ్డి అల్లూరుపేటలోనే పుట్టారు. ఇక్కడ వారికున్న ఇల్లు, పొలాలు అమ్మి బతుకు దెరువు కోసం మహబూబ్‌నగర్ జిల్లా తీలేరు వెళ్లి స్థిరపడిపోయి అమరచింతల శాసనసభ్యునిగా రెండుసార్లు గెలుపొందారు. ఇప్పుడున్న తెలంగాణా గొడవ మూలంగా ఆయన బహుశా నెల్లూరీయుడని పొరపాటున కూడా చెప్పడేమో?



## ఆ ఇద్దరు ఖైదీలు హైదరాబాద్ తరలింపు!

హైదరాబాద్‌లో జరిగిన పేలుళ్లలో హస్తమున్నట్లు ఆరోపణలు ఎదుర్కొంటున్న తీవ్రవాది మగ్బూల్ నెల్లూరు సెంట్రల్ జైలులో శిక్ష అనుభవిస్తున్న ఫిరోజ్ ఖాన్, అలీభాయ్‌లను గత ఏడాది కలవడం సంచలనం సృష్టించింది. ఈ వ్యవహారం మీడియా ద్వారా బయట పడడంతో జాతీయ భద్రతాదళం వీరి విచారణకు నెల్లూరు వస్తున్నట్లు ప్రచారం జరిగింది. జైలు దగ్గర సినిమా తరహా ఎత్తుగా ఇసుక బస్తాలు పేర్చి సెంట్రీని కాపలా కూడా పెట్టారు. కానీ తీవ్రవాద నేరాలతో సంబంధముండే వ్యక్తుల దర్యాప్తుకు అవసరమైన సరంజామా నెల్లూరులో లేకపోవడంతో ఫిరోజ్, అలీలను అత్యంత రహస్యంగా హైదరాబాద్ తరలించినట్లు విశ్వసనీయంగా తెలిసింది.

## సిఎం రాక!

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి జిల్లా పర్యటన ఎట్టకేలకు ఖరారయ్యింది. ఇందిరమ్మ బాట కార్యక్రమంలో పాల్గొనను ఆయన ఈ నెల 3, 4, 5 తేదీల్లో నెల్లూరు వస్తున్నారు. సోమశిల హైలెవల్ కాలువకు శంకుస్థాపన, రాపూరు, ఆదూరుపల్లి, చెన్నూరు, గూడూరు, కృష్ణపట్నం, నెల్లూరు, కొడవలూరులలో పర్యటిస్తారు. నెల్లూరులో వైద్య కళాశాలకు శంకుస్థాపన కూడా చేస్తారు.

## దర్యాప్తులో తేలిన నిజం!

నెల్లూరు హరనాధపురంలో జంట హత్యలు చేసిన ఇంతియాజ్‌ను పోలీసులు సరిగ్గా విచారించలేదని గతవారం 'జమీన్ రైతు'లోనూ సందేహం వెలిబుస్తూ వార్త వ్రాసిన సంగతి పాఠకులకు విదితమే. ఈ విషయం నూటికి నూరుపాళ్లు నిజమని పోలీసు దర్యాప్తులో తేలింది. కోర్టు అనుమతితో ఇంతియాజ్‌ను సెంట్రల్ జైలు నుంచి తీసుకొచ్చిన పోలీసులు విచారించగా బాలాజీనగర్‌లో వెంకటసుబ్బమ్మ, రామ్మూర్తినగర్‌లో నారాయణమ్మలను హత్య చేసినట్లు తేలింది. ఈ హత్యలు మరో రెండు మూడు దోపిడీలను అఖిల్ అహ్మద్, మరో ముగ్గురు మైనారిటీ తీరని యువకులతో చేయించినట్లు కాలాంతకుడైన ఇంతియాజ్ ఒప్పుకొన్నాడట. దీంతో మిగతా వారిని కూడా అదుపులోకి తీసుకొని విచారించే పనిలో పడ్డారు పోలీసులు. ఒక్కసారిగా డబ్బు గడించాలన్నయావ మనుషులను హంతకులను చేసేస్తుందని ఇంతియాజ్ ఉదంతమే చక్కని ఉదాహరణగా చెప్పొచ్చు.

## నెల్లూరులోనూ కనిపించిన రాకెట్

శ్రీహరికోటలోని షార్ కేంద్రం నుంచి ఫిబ్రవరి 25వ తేది ప్రయోగించిన పిఎస్ఎల్వీసి–20 రాకెట్ నెల్లూరు గగనతలం నుంచి కూడా కనిపించింది. ఆకాశం నిర్మలంగా ఉండడంతో ఆ రోజు సాయంత్రం ఆరు గంటల నుంచి పది నిమిషాల పాటు నెల్లూరు మీదుగా గగనతలంలోనికి దూసుక వెళ్తుండిన రాకెట్‌ను పలువురు ఔత్సాహికులు తమ సెల్‌ఫోన్ల ద్వారా ఫోటోలు తీశారు.

## రిజర్వేషన్ లేకుంటే...

రిజర్వేషన్, కో ఆప్షన్‌ల ద్వారా ఎంపిక లేకుంటే నెల్లూరు డిసిసిబి, డిసిఎంఎస్ బ్యాంకులకు ఎస్సీ, ఎస్టీలలో ఒక్కరూ డైరెక్టర్ అయ్యి ఉండేవారు కాదు. జిల్లాలోని ఏ సొసైటీ అధ్యక్షునిగా ఒక్క ఎస్సీ, ఎస్టీని ఏ రాజకీయ పార్టీ చేయలేదు. అల్లూరు మండలం పురిణి సహకార సంఘ అధ్యక్షునిగా ముస్లిం మైనార్టీ సయ్యద్ సాహెబ్ ఎన్నికయ్యాడు. ఈయన తెలుగుదేశం పార్టీకి చెందిన వ్యక్తి. దీనివల్ల ఒకే ఒక్కడుగా ఆయన ఎన్నికైనా పార్టీ అడ్డొచ్చి కో ఆప్షన్ సభ్యుడ్ని కాకుండా చేసింది. ఎవరు ఏమి అనుకున్నా అగ్రవర్ణాల వారే ఎక్కువగా సొసైటీ అధ్యక్షులుగా ఎన్నిక కావడం నెల్లూరు రాజకీయ మహత్యంగా చెప్పుకోక తప్పదు.

## యువకుల రాష్ డ్రైవింగ్!

నెల్లూరు యువకులు స్కూటర్లమీద అమిత రాష్ డ్రైవింగ్ చేస్తూ కనపడుతున్నారు. గతవారం ముగ్గురు యువకులు రాజేష్, శివ, రాజ్‌కుమార్‌లను రాష్ డ్రైవింగ్ కోమాలోనికి వెళ్లేట్లు చేసింది. ఈ వ్యవహారమై విద్యా సంస్థలు యువకులను చైతన్య పర్చే కార్యక్రమం చేపడితే బాగుంటుంది.

## నెల్లూరుకు సుందర చైతన్య స్వామి!

స్వామి సుందర చైతన్య ఈ నెల 3వ తేది నుంచి 10వ తేది వరకు నెల్లూరులోనే ఉంటారు. విఆర్ కాలేజి గ్రౌండ్స్‌లో ప్రతిరోజు సాయంత్రం 6.30 గంటల నుంచి ఎనిమిది గంటల వరకు శ్రీమద్భాగవతం – శ్రీకృష్ణలీలా వైభవం గూర్చి ఉపన్యసిస్తారు. ఆధ్యాత్మిక జిజ్ఞాసులను ఈ కార్యక్రమానికి తరలి రమ్మంటున్నారు నిర్వాహకులు.



మాజీ ముఖ్యమంత్రి, రాజ్యసభ సభ్యుడు నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి జన్మదినోత్సవం సందర్భంగా హైదరాబాద్‌లో ఆయనకు శుభాకాంక్షలు తెలియజేస్తున్న బాలసుధాకర్, కోటీశ్వరరెడ్డి. ఫోటోలో రాజ్యలక్ష్మమ్మ కూడా వున్నారు.

## ముసలోడికి జైలు శిక్ష!

నెల్లూరు రూరల్ మండలం ధనలక్ష్మీపురంలో కన్నూ మిన్నూగానక పసిపిల్లపై అత్యాచారానికి ఒడిగట్టిన వనపర్తి సుబ్బరాయుడు(73)కు పదేళ్ల జైలు శిక్ష, 25వేల రూపాయల జరిమానా, మరో 24వేలు పరిహారంగా చెల్లించమని చెబుతూ నెల్లూరు ప్రిన్సిపల్ అసిస్టెంట్ సెషన్స్ జడ్జి రజని తీర్పునిచ్చారు. సుబ్బరాయుడు 2009 నవంబర్ 13వ తేది పసిపిల్లపై అత్యాచారం చేశాడు. ఈ విషయమై నెల్లూరు రూరల్ పోలీసులు గట్టి ఆధారాలతో కేసును రూపొందించడంతో ఈ శిక్ష పడింది.

## రైసు మిల్లులపై దాడులు

నెల్లూరు నవాబుపేటలోని పలు రైసు మిల్లులపై డిఎస్ఓ ఉమామహేశ్వరరావు 22వ తేది దాడులు చేశారు. ఎమ్మీఆర్ రైసుమిల్లులో స్టాక్ రిజిష్టర్‌లో నమోదు చేయకుండా నిల్వ ఉంచిన బియ్యాన్ని సీజ్ చేశారాయన. విచిత్రంగా ఈ దాడుల్లో ఎక్కడా సన్న బియ్యం రైసుమిల్లుల్లో దొరకలేదు. ఆడించినవి ఆడించినట్లు చెన్నైకు జాక్‌పాట్ లారీల్లో వెళ్తుంటే ఇంకెక్కడ దొరుకుతాయి సార్!

## బాబును కలిసిన తెలుగు తమ్ముళ్లు!

పాదయాత్రలో వున్న తెలుగుదేశం పార్టీ సర్వాధినేత చంద్రబాబు నాయుడిని నెల్లూరు తెలుగు తమ్ముళ్లు 25వ తేది గుంటూరు జిల్లాలో కలిశారు. సహకార ఎన్నికలపై ఇంకాస్త దృష్టిపెట్టి ఉంటే ఇంకొన్ని సొసైటీలు వచ్చేవని బాబు వీరితో అన్నట్లు తెలిసింది. చంద్రబాబును కలిసిన వారిలో పొలిట్ బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, ఎమ్మెల్యేలు బీద మస్తాన్‌రావు, పరసా రత్నం, పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర, మాజీ మంత్రి రమేష్ రెడ్డి, కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి తదితరులున్నారు.

## ఆప్కో డైరెక్టర్‌గా వెంకటగిరీయుడు!

ఆప్కో డైరెక్టర్ పదవికి ప్రతిష్టాత్మకంగా జరిగిన ఎన్నికల్లో వెంకటగిరి వాసి పరిధం చెంచల్ రావు విజయం సాధించారు.

## నెల్లూరులో జాఫర్ షరీఫ్!

మాజీ కేంద్రమంత్రి, కర్నాటకకు చెందిన సి.కె జాఫర్ షరీఫ్ ఈ మధ్య తరచూ నెల్లూరు వస్తున్నారు. నగరంలోని బారాషహీద్, కసుమూరులోని మస్తానయ్య, వేనాడు దర్గాలలో ప్రత్యేక ఫాతెహాలు చెల్లించి వెళ్తున్నారు. ఎఎస్ పేట దర్గా దూరంగా ఉందని కాబోలు ఆ వైపు వెళ్లడం లేదాయన.

## మతాలన్నీ స్త్రీలకు వ్యతిరేకమే!

పురుషాధిక్య సమాజంలో మతాలన్నీ స్త్రీలకు వ్యతిరేకమేనని హేతువాద సంఘం నేత పెన్మత్స సుబ్బరాజు వ్యాఖ్యా

కొరవ 14వ పేజీలో

● సమయానుకూలంగా లేని

# చెన్నై మెమూ రైళ్లు!

ప్రతి రోజు ఉదయం ఏడు గంటలకు చెన్నైలో బయలుదేరుతున్న రెండు మెమూ రైళ్ల వల్ల అక్కడ నుంచి బయలుదేరే ప్రయాణీకులకు మేలు జరుగుతుంది తప్ప నెల్లూరీయులకు వీటివల్ల ఎటువంటి ప్రయోజనం లేకుండా పోతుందని ప్రయాణీకులు పెదవి విరుస్తున్నారు. చెన్నైలో బయలుదేరే రెండు మెమూ రైళ్లలో ఒకటి తిరుపతికి మధ్యాహ్నం 11.25కు చేరుకుని అక్కడ నుంచి వెంకటగిరి మీదుగా 3.30 గంటలకు నెల్లూరు వస్తుంది. మళ్లీ ఇక్కడ నుంచి బయలుదేరి చెన్నై వెళ్తుంది. మరో రైలు చెన్నై నుంచి నెల్లూరుకు 12.25కు చేరుకొని తిరుపతి మీదుగా రాత్రికి చెన్నైకి చేరుతుంది. మధ్యాహ్నం 12.25, 3.30 గంటల సమయాలు చెన్నై ప్రయాణానికి అనువుగా లేదని నెల్లూరీయుల గగ్గోలు.

## మధ్యాహ్నం పూట నెల్లూరు వస్తున్నాయి

చెన్నైలో మెమూ రైళ్లు బయలుదేరిన సమయానికే నెల్లూరు నుంచి ఒక రైలు చెన్నైకు, మరో రైలు తిరుపతికి బయలుదేరితే అన్నింటికీ యోగ్యంగా ఉంటుందంటున్నారు. ఉదయం సమయంలో తిరుపతి నుంచి నెల్లూరుకు ఓ మెమూ రైలు నడిపేందుకు రైల్వే శాఖాధికారులను నెల్లూరీయులైన ఎమ్పీలు ఒప్పించాలంటున్నారు. అదేవిధంగా విజయవాడ నుంచి బిట్రగుంట వద్దకు వస్తున్న ప్యాసింజర్‌ను నెల్లూరు వరకు, చెన్నై – బిట్రగుంట మధ్య నడుస్తున్న ప్యాసింజర్‌ను కావలి వరకు పొడిగించేలా చర్యలు తీసుకుంటే ప్రయాణీకులకు సౌలభ్యంగా ఉంటుందన్నారు. నెల్లూరు నేతలు తలచుకుంటే ఈ పొడిగింపులు, మార్పుచేర్పులు పెద్ద పనికాదు. ఈ విషయాలు వాళ్లకు తలకెక్కేలా చెప్పే బాధ్యత రైల్వే యూజర్స్ అసోసియేషన్ లాంటి సంస్థలు తీసుకోవాల్సి ఉంది.



శిలాఫలకాన్ని ఆవిష్కరిస్తున్న మంత్రి ఆనం రామనారాయణరెడ్డి.

# రంగడి గుడిలో పలు అభివృద్ధి పనులు!

## ప్రారంభోత్సవం చేసిన రామనారాయణరెడ్డి

నెల్లూరీయుల ఆరాధ్య దైవం రంగనాయకుల స్వామి దేవస్థానంలో మూడు కోట్ల 79 లక్షల రూపాయలు వెచ్చించి నిర్మించిన కళ్యాణ మండపం, సాంస్కృతిక వేదిక, ఆర్చ్‌లను ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి 22వ తేదీ ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ తాను పర్యాటక మంత్రిగా ఉన్నప్పుడు రాష్ట్రంలోని ఆలయాల అభివృద్ధికి 57 కోట్ల రూపాయలు విడుదల చేశానన్నారు. ఈ మొత్తంలో 23 కోట్ల రూపాయలను జిల్లాలోని దేవాలయాల అభివృద్ధికి మంజూరు చేశానన్నారు. రంగడి గుడిలో అభివృద్ధి పనులు జరగ్గా మిగిలిన 40 లక్షల రూపాయలతో కళ్యాణ మండపం పైన మరో అంతస్తు నిర్మిస్తామన్నారు. ఈ కళ్యాణ మండపం తక్కువ బాడుగతో పేద, మధ్యతరగతీయులకు అందుబాటులో ఉండేలా చూస్తామన్నారు. ఈ కార్యక్రమంలో సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, దేవాదాయ శాఖ అసిస్టెంట్ కమిషనర్ గ్రంధి యానాదిశెట్టి, ఆర్డీఓ మాధవీలత, మునిసిపల్ కమిషనర్ ఆంజనేయులు, ఆనం రంగమయూర్‌రెడ్డి, ఆల్తూరు ఆదినారాయణరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# అర్చకుల సంక్షేమ నిధులు వినియోగించుకోండి!

రాష్ట్రంలో అర్చకుల అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం 100 కోట్ల రూపాయల నిధులను మంజూరు చేసినట్లు రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక సలహాదారుడు, మాజీ ఐఏఎస్ అధికారి కె.వి.రమణాచారి తెలిపారు. 22వ తేది నెల్లూరు టౌన్‌హాల్‌లో మైమ్ కళాకారుడు మైపాడు రాజా నేతృత్వంలో ధర్మరక్షణ శంఖారావం సంస్థ ఆధ్వర్యంలో 61 మంది అర్చకులకు అందించిన కామధేనువు పురస్కారోత్సవంలో ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. అర్చకుల సమాఖ్యకు నిధులున్నాయనే విషయం అర్చకులకు తెలియక పోవడం బాధాకరమన్నారు. ఉపనయనం, ఇంటి నిర్మాణం, చదువు, పుస్తక ప్రచురణ, ఆరోగ్యంలాంటి ప్రతి అవసరానికి ఈ నిధులు ఉపయోగించుకోవచ్చన్నారు. నేటి విద్యార్థులు టీవీలు చూడడం, క్రికెట్ ఆడడంతోపాటు అమ్మ, చదువు, సంస్కృతులను కూడా తెలుసుకోవాలన్నారు. డబ్బుతో గుడి కట్టవచ్చుకానీ, దేవుడ్ని మాత్రం అక్కడ నెలకొల్పలేమన్నారు. అహంభావం వ్యక్తి ఎదుగుదలను అరికడుతుందని, వినయమే భూషణమన్నారు. ఈ కార్యక్రమంలో రమణాచారి సతీమణి లత కూడా పాల్గొని ఒపిగ్గా అర్చక ప్రముఖులను సన్మానించారు.

**నెల్లూరులో ప్రభుత్వ సాంస్కృతిక సలహాదారు పిలుపు**

# ఇంటర్ పరీక్షా పత్రాలు దిద్దే కేంద్రం మార్పుకు యత్నం!

● ఎందుకీ ప్రయాస పరంధామయ్య గారు?

ఇంటర్మీడియట్ ప్రాంతీయ అధికారికి, కళాశాల ప్రిన్సిపాల్‌కు మధ్య నెలకొన్న వైరం పరీక్షా పత్రాల మూల్యాంకన కేంద్రాన్ని మార్పు చేయాలనేంత వరకు వెళ్లడం నగరంలో చర్చనీయాంశమయ్యింది. గత ముప్పై ఏళ్లుగా స్టోన్‌హౌస్‌పేటలో గల ప్రభుత్వ జూనియర్ కళాశాల అయిన కెవిసిలోనే ఇంటర్మీడియట్ విద్యార్థుల పరీక్షా పత్రాల మూల్యాంకన జరుగుతుంది. ఆర్ఐఓగా ఎవరు వున్నా ఈ పద్ధతి పాటిస్తూ వచ్చారు. ఈసారి మాత్రం ఈ కేంద్రాన్ని మార్చమని ఆర్ఐఓ, మార్చడానికి వీలులేదని కెవిసిలోనే నిర్వహించాలని లెక్చరర్లు పట్టుపడుతుండడంతో ఈ వ్యవహారం రంజుగా మారింది. కళాశాలలో నూతన నిర్మాణాలు చేపట్టదలచినందున ఈసారి జరిగే పరీక్షా పత్రాల మూల్యాంకనను విఆర్‌సిలో నిర్వహించాలని, అదైతే అనువుగా వుంటుందని ఆర్ఐఓ భావిస్తున్నారు. ఎప్పుడూ లేనిది వున్నట్లుండి ఎందుకు దీనిని మారుస్తున్నారు. నిర్మాణాలు ఈ సమయంలోనే చేపట్టవలసిన అవసరం ఏమిటని అధ్యాపకులు ప్రశ్నిస్తున్నారు. దీని వెనుక ఆర్ఐఓకు, కెవిసి ప్రిన్సిపాల్‌కు మధ్య నెలకొన్న వివాదాలే కారణమని తెలుస్తోంది. ఆర్ఐఓగా వున్న వ్యక్తి క్యాంప్ ఆఫీసర్‌గా వ్యవహరిస్తే, అసిస్టెంట్ క్యాంప్ ఆఫీసర్‌గా స్థానిక కళాశాల ప్రిన్సిపాల్ వ్యవహరిస్తారు. ఇక్కడే వివాదం రాజుకొంది. ఆర్ఐఓ కెవిసి ప్రిన్సిపాల్‌ను కాకుండా, తనకు శిష్యుడైన కోవూరు మండలంలో పనిచేస్తున్న మరో కళాశాల ప్రిన్సిపాల్‌ను ఎసిఓగా నియమించుకొనేందుకు ఈ తతంగం అంతా నడిపిస్తున్నారనే ఆరోపణలు వస్తున్నాయి. తన భజన బృందంలో సభ్యుడైన ఆయనకు ఇది దక్కేందుకుగాను పరీక్షా పత్రాల మూల్యాంకన కేంద్రాన్ని మార్చాలని ప్రయత్నిస్తున్నట్లు సమాచారం. ఇందుకోసం ఇంటర్మీడియట్ పరీక్షల అధికారులను మచ్చిక చేసుకొంటున్నాడట. ఇటీవల జరిగిన ప్రాక్టికల్స్‌కు పరిశీలకుడిగా వచ్చిన ఒక అధికారిని విఆర్‌సికి సమీపంలో పునః నిర్మించిన హోటల్‌లో దింపి అతనికి భారీస్థాయిలో మద్యం పార్టీలు, విందులు ఇచ్చినట్లు సమాచారం. ఆనాటి నుంచి ఈ కేంద్రాన్ని ఎలాగైనా కెవిసి నుంచి తప్పించాలని ప్రయత్నిస్తున్నాడట. అయితే వాస్తవంగా గమనిస్తే ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం రెండు లక్షల రూపాయల నిధులతో కెవిసిలో టాయిలెట్లు ఇతరత్రా సౌకర్యాలు కల్పించి వున్నారు. అలాగే ఇటీవల కెవిసి కళాశాల ప్రిన్సిపాల్‌గా రిటైర్డ్ అయిన సూర్యనారాయణరెడ్డి అనే ఆయన వాటర్ ట్యాంక్ ఏర్పాటు చేశారు. అన్ని సౌకర్యాలున్న ఇక్కడ కాకుండా సెంటర్‌ను మార్చాలని గట్టిగా ప్రయత్నిస్తూ, దానికి కుంటి సాకులు చెప్పుడడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

# డాక్టర్ కిషోర్స్ రత్నం స్కూల్ విద్యార్థుల ప్రతిభ!

● ఎన్‌టిఎస్‌ఇ పరీక్షల్లో ప్రథములు

ఇటీవల జరిగిన జాతీయ ప్రతిభా పరీక్ష(ఎన్‌టిఎస్‌ఇ) నెల్లూరు సరస్వతినగర్‌లోని డాక్టర్ కిషోర్స్ రత్నం స్కూల్ విద్యార్థులు మెరుగైన ఫలితాలు సాధించారు. విద్యార్థులు కె.యశ్వంత్, కె.కమల్, ప్రత్యూష, ఏ.వి.సోమయ్య, అరుణ్‌క్రాంత్‌లను ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి 22వ తేది అభినందించి స్కూల్ యాజమాన్యం అందించిన ప్రోత్సాహక బహుమతి ఒక్కో విద్యార్థికి ఐదు వేల రూపాయలను అందించారు. ప్రత్యేక విద్యావిధానంలో బోధన వల్ల తమ విద్యార్థులు ఎన్‌టిఎస్‌ఇ పరీక్షలో విజేతలుగా నిలిచారని ప్రిన్సిపాల్ కె.సంయుక్త ఈ సందర్భంగా చెప్పారు. ఈ కార్యక్రమంలో నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, విద్యా సంస్థల జనరల్ మేనేజర్ రామ్మూర్తినాయుడు, ప్రిన్సిపల్ తుహీనా, మేనేజర్ రాజేష్ తదితరులు పాల్గొన్నారు.

# మహిళల హ్యాండ్ బాల్ పోటీల్లో విజేత ఢిల్లీ జట్టు!



విజేత జట్టు ఢిల్లీకి కప్‌ను అందజేస్తున్న మంత్రి.

## నెల్లూరు ఆతిథ్యాన్ని తెగపొగిడిన జట్లు

నగరంలోని విఆర్ కళాశాల మైదానంలో హోరాహోరీగా జరిగిన జాతీయ మహిళల హ్యాండ్‌బాల్ పోటీల్లో ఢిల్లీ జట్టు విజేతగా నిలిచింది. హర్యానా, ఢిల్లీ జట్ల మధ్య చివరి వరకు నువ్వా నేనా అన్నట్లు జరిగిన పోటీల్లో ఢిల్లీ జట్టు పైచేయి సాధించి విజయ పతాక ఎగురవేసింది. ఫిబ్రవరి 17 నుంచి ప్రారంభమైన ఈ హ్యాండ్ బాల్ పోటీలు 22వ తేది వరకు ఆరు రోజులపాటు రసవత్తరంగా జరిగాయి. దేశంలోని దాదాపు 21 రాష్ట్రాల నుంచి 360 మంది క్రీడాకారులు ఈ పోటీల్లో పాల్గొన్నారు. ఢిల్లీ, హర్యానా, పంజాబ్, ఛత్తీస్‌ఘడ్, మహారాష్ట్ర తదితర రాష్ట్రాలకు చెందిన క్రీడాకారిణులు ఈ పోటీల్లో పాల్గొనేందుకు తరలి రావడంతో విఆర్‌సి కొత్త శోభను సంతరించుకొంది. దాదాపు 40 లక్షలకు పైగా వెచ్చించి ఈ పోటీలను నిర్వహించారు. లీగ్ కమ్ నాకౌట్ పద్ధతులలో జరిగిన ఈ పోటీలను తిలకించేందుకు ప్రేక్షకులు అధిక సంఖ్యలో తరలి రావడంతో గ్యాలరీలు క్రిక్కిరిసి పోయాయి. క్రీడాకారిణులకు ఆతిథ్యం ఇవ్వడంలో నెల్లూరు మరోసారి తన పేరు నిలుపుకొంది. వివిధ జాతీయస్థాయి పోటీల్లో పాల్గొన్నప్పటికీ ఇక్కడ లభించినంత ఆతిథ్యం, ముఖ్యంగా వసతి, ఆహార విషయంలో మరెక్కడా అందలేదని పలువురు క్రీడాకారిణులు సంతోషం వ్యక్తం చేశారు. మొదటి నుంచి చక్కని ప్రతిభతో విజేతగా నిలుస్తుందని భావించిన హర్యానా జట్టు చివరికొచ్చేసరికి చతికిలబడింది. గత ఏడాది జరిగిన హ్యాండ్ బాల్ పోటీల్లో విజేతగా నిలిచిన ఢిల్లీ జట్టు ఈ సారి కూడా విజయం సాధించి మరో సారి తన సత్తా చాటుకొంది. ప్రారంభ వేడుకలతోపాటు, ముగింపు కార్యక్రమానికి ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి హాజరై క్రీడాకారిణులకు మెమెంటోలు అందజేశారు. మొత్తం 23 జట్లు పాల్గొన్న ఈ పోటీల్లో పంజాబ్ జట్టు తృతీయ స్థానాన్ని సాధించింది.

## ● కావలిలో

# ప్రతాప్‌కుమార్‌రెడ్డి ప్రజాదీవెన మొదలు!



ప్రజల సమస్యలు తెలుసుకొంటున్న ప్రతాప్‌కుమార్‌రెడ్డి.

కావలి నియోజకవర్గ పరిధిలో ప్రజా సమస్యలు తెలుసుకొనేందుకు, పార్టీని పటిష్టం చేసి ప్రజల దగ్గరకు తీసుకొని వెళ్లేందుకు వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి ప్రజాదీవెన కార్యక్రమాన్ని చేపట్టారు. ఈ యాత్రలో భాగంగా ఆయన ఇంటింటికి వెళ్లి ప్రజలను కలుసుకొంటూ పార్టీ మేనిఫెస్టోను వివరిస్తూ ప్రచారం నిర్వహిస్తున్నారు. రాష్ట్రం సుభిక్షంగా వుండాలన్నా, అన్ని వర్గాల ప్రజలు అభివృద్ధి చెందాలన్నా వైఎస్ జగన్ ముఖ్యమంత్రి కావాలన్నారు. ఆయన ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపడితేనే రాష్ట్రాభివృద్ధి సాధ్యమవుతుందన్నారు. దివంగత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రజల బాధలు గుర్తించి వాటి పరిష్కారానికి, అభివృద్ధికి ఎంతగానో కృషి చేశారని, పలు జనరంజక పథకాలు, సంక్షేమ పథకాలు ప్రవేశ పెట్టారన్నారు. ఆయన ఆశయాలు నెరవేరాలంటే జగన్‌ను ముఖ్యమంత్రి చేయాల్సిన అవసరం ఎంతైన వుందన్నారు. వైఎస్ కృషితో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజలను దోచుకొంటున్నాదన్నారు. ధరలు పెంచి ప్రజల జీవనాన్ని దుర్భరం చేస్తున్నాదని విమర్శించారు. ప్రజలు చైతన్యవంతులై వచ్చే ఎన్నికల్లో టిడిపి, కాంగ్రెస్ పార్టీలకు బుద్ధి చెప్పాలన్నారు. మొదటిగా కళుగోళ శాంభవి దర్శనం చేసుకొని యాత్ర ప్రారంభించిన ప్రతాప్‌కుమార్‌రెడ్డి పట్టణ పరిధితోపాటు, కావలి మండలం చెన్నాయపాళెం, అన్నెమడుగు, గిరిజనకాలనీలో పర్యటించారు. ఈ కార్యక్రమంలో ఆ పార్టీ నేతలు బాబుల్‌రెడ్డి, ప్రసాద్, సురేంద్రరెడ్డి, ప్రభాకర్‌రెడ్డి పాల్గొన్నారు.

## కోడూరులో

# ప్రారంభమైన కాకాణి దీవెన!

సర్వేపల్లి నియోజకవర్గంలో వైకాపా జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి చేపట్టిన ప్రజా దీవెన యాత్రకు భారీగా జనం తరలివచ్చారు. తోటపల్లి గూడూరు మండలం కోడూరులో సభ నిర్వహించారు. నియోజకవర్గానికి వివిధ ప్రాంతాల నుంచి పెద్ద ఎత్తున ఆ పార్టీ అభిమానులు, కార్యకర్తలు తరలిరావడంతోపాటు, ఫ్లెక్సీలు, బ్యానర్లు ఏర్పాటుచేసి దడబడలు సృష్టించారు. కోవూరు శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా కాకాణి జిల్లాపరిషత్ ఛైర్మన్‌గా తాను చేసిన అభివృద్ధి కార్యక్రమాలను ప్రజలకు వివరించడంతోపాటు వైఎస్ జగన్ ముఖ్యమంత్రి కావాల్సిన ఆవశ్యకతను తెలిపారు. వైఎస్‌రాజశేఖర్‌రెడ్డిపై వున్న అభిమానం, జగన్ సత్తా వల్లే తాను గెలిచానని ప్రసన్నకుమార్‌రెడ్డి స్పష్టం చేశారు. కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి సహజ ధోరణిలో చేసిన ఆవేశపూరిత ప్రసంగం ఎందుకనో ప్రజలను ఆకట్టుకోలేకపోయింది. వీరితో పాటు పలువురు నేతలు ప్రసంగించారు. కాకాణికి స్వాగతం పలికేందుకు మహిళలు పెద్దసంఖ్యలో బారులు తీరినా ఈ ప్రాంతంలో బలమైన నాయకుడులేని కొరత కొట్టొచ్చినట్లు కన్పడింది.

# బిట్రగుంటను అభివృద్ధి చేయండి!

## అన్ని రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాల ధర్నా

బిట్రగుంట రైల్వే అభివృద్ధికి చర్యలు చేపట్టాలని డిమాండ్ చేస్తూ వివిధ రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాల ఆధ్వర్యంలో బోగోలులో ధర్నా జరిగింది. చాలా కాలంగా ఈ ప్రాంతీయులు బిట్రగుంట అభివృద్ధిపై ఆశలు పెట్టుకొని వుండడం, ఎన్నికలలో ఈ ప్రాంతాన్ని, రైల్వేపరంగా అభివృద్ధి చేస్తామని, పూర్వవైభవం తీసుకొని వస్తామని ఉపన్యాసాలు, హామీలు ఇచ్చిన ప్రజాప్రతినిధులు ఆ తర్వాత దీని గురించే పట్టించుకోకపోవడంతో బిట్రగుంట అభివృద్ధికి నోచుకోలేదు. ప్రజాప్రతినిధులు హామీలు నెరవేరకపోవడంతో తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తూ పలువురు ఆందోళన చేపట్టారు. ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీ, వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ, సిపిఐ, సిపిఎంలతోపాటు రైతు సంఘాలు, వ్యాపారసంఘాలు ఈ ధర్నాకు మద్దతు పలకడంతో ధర్నా పెద్ద ఎత్తున జరిగింది. మండలంలోని 16 పంచాయితీల నుంచి ప్రజలు స్వచ్ఛంధంగా పాల్గొనడం విశేషం. రైల్వే కార్మికులు ఈ ధర్నా కార్యక్రమంలో పాల్గొన్నారు. పలు పార్టీల నాయకులు తమ ప్రసంగాలలో బిట్రగుంట రైల్వేకు పూర్వ వైభవం తీసుకొని రావాలని, విద్యుత్ రైలు ఇంజన్ల పిఓహెచ్‌ను ఏర్పాటు చేయాలని, బిట్రగుంట వరకు మెము రైళ్లను పొడిగించాలని, పినాకిని ఎక్స్‌ప్రెస్‌కు స్టాపింగ్ ఇవ్వాలని డిమాండ్ చేశారు. ఏదోఒక యూనిట్ ఇక్కడ ఏర్పాటు చేస్తే వందల కుటుంబాలకు ఆధారం లభిస్తుందన్నారు.

# హాస్టళ్ల ఆధునీకరణ!

జిల్లాలోని 152 ఎస్సీ వసతి గృహాలను కోటి 31 లక్షల రూపాయలతో ఆధునీకరణ చేయనున్నట్లు ఆశాఖ డిడి విశ్వమోహన్‌రెడ్డి తెలిపారు. ఇటీవల ఆయన మనుబోలులోని ఎస్సీ బాలికల వసతి గృహాన్ని పరిశీలించారు. ఆయన మాట్లాడుతూ గూడూరు డివిజన్‌లో 32లక్షల రూపాయలతో వసతి గృహాలకు మరమ్మత్తులు చేయించామన్నారు. క్రీడా పరికరాలను, పడుకొనేందుకు చాపలను ఇతర వస్తువులను సరఫరా చేశామన్నారు. మనుబోలు బాలికల వసతి గృహానికి ఐదు లక్షల రూపాయలు కేటాయించనున్నట్లు తెలిపారు. మెనూ పాటించడంలో వార్డెన్లు జాగ్రత్తగా వ్యవహరించాలని, ఏమాత్రం అశ్రద్ధ చేసినా చర్యలు తప్పవన్నారు. ఈ కార్యక్రమంలో ఎఎస్‌డబ్ల్యుఓ తిరుపతిరెడ్డి, ప్రసూన, రాంబాబు తదితరులు పాల్గొన్నారు.

## ● చేజర్ల స్కూలు

# అభివృద్ధికి ఐదులక్షలు

చేజర్ల జిల్లా పరిషత్ హైస్కూల్ అభివృద్ధికి ఐదులక్షల రూపాయలు మంజూరు అయ్యాయి. ఈ పాఠశాల 50 సంవత్సరాలు పూర్తి చేసుకొన్న సందర్భంగా పాఠశాల అభివృద్ధికి పూర్వవిద్యార్థులు సిద్ధమయ్యారు. తమవంతు సహాయ సహకారం అందించడంతోపాటు ప్రభుత్వం నుంచి సహాయం చేయాలని ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డిని కోరారు. దీనికి స్పందించిన మంత్రి జిల్లా కలెక్టర్‌కు విశదీకరించడంతో ఆయన పాఠశాల అభివృద్ధికి 5 లక్షల రూపాయలు మంజూరు చేస్తూ ఉత్తర్వులు జారీ చేశారు. కలెక్టర్, మంత్రి చొరవతో పాఠశాలలో నెలకొన్న సమస్యలు పరిష్కరింపబడతాయని పూర్వవిద్యార్థులు సంతోషం వ్యక్తం చేస్తున్నారు.

# టేకు మొక్కల సొమ్ము స్వాహా!

## కమ్యూనిటీ సర్వీస్ ప్రొవైడర్ల ఘనతిది

ఉపాధి హామీ పథకం క్రింద రైతులకు, కూలీలకు పంపిణీ చేయాల్సిన సొమ్ము పలు ప్రాంతాలలో కమ్యూనిటీ సర్వీస్ ప్రొవైడర్లు దిగమింగేస్తున్నారు. దీంతో ఈ పథక ఉద్దేశం నీరుగారిపోతుంది. అప్పనంగా కూలీలసొమ్ము బొక్కేస్తున్నా అలాంటి వారిపై చర్యలు లేకపోవడంతో రోజురోజుకు ఇవి పెరిగిపోతున్నాయి. తాజాగా కలువాయి మండలంలో టేకు మొక్కల సొమ్మును స్వాహా చేశారు. మండల పరిధిలో గల కేశమనేనిపల్లి, తిరుమలపాడు గ్రామాల రైతులు ఉపాధిహామీ పథకం ద్వారా పొలాల గట్లపై టేకు మొక్కలు నాటారు. దీనికి సంబంధించి షుమారు 60 వేల రూపాయలు వారికి అందాల్సి వుంది. అయితే ఆ గ్రామ సిఎస్‌పి ఆ మొత్తాన్ని రైతుల కూలీలకు చెల్లించకుండా సొమ్ము దిగమింగడంతోపాటు అంతా సక్రమంగా జరిగినట్లు రికార్డుల్లో నమోదు చేశారట. ఎంతకూ ప్రభుత్వం నుంచి రావాల్సిన మొత్తం రాకపోవడంతో విచారించిన రైతుకు ఈ అక్రమ వ్యవహారం తెలిసింది. దీంతో రైతులు మాజీ మండలాధ్యక్షుడు అనిల్‌కుమార్‌రెడ్డి ఆధ్వర్యంలో మండల అభివృద్ధి అధికారిణి గాయత్రిదేవిని కలిసి ఫిర్యాదు చేశారు. దీనిపై స్పందించిన ఎంపిడిఓ బాధ్యుడైన సిఎస్‌పిని పిలిచి విచారించగా నగదులో 40వేల రూపాలయలు ఇంటి అవసరాలకు వాడుకొన్నానని, మరో 20వేల రూపాయలు తన వద్దనే వుందని ఎలాంటి జంకుబొంకూ లేకుండా సమాచారమిచ్చాడట. అతని వద్దనుంచి లిఖిత పూర్వకంగా స్టేట్‌మెంట్ తీసుకొని నివేదికను డ్వామా పిడికి పంపనున్నట్లు ఎంపిడిఓ తెలిపారు.



సత్యంజీ
సింహపురి సిటి
అందమైన గ్రీన్ పార్క్
వి.ఐ.ఆర్. స్కూల్ దగ్గర, ధనలక్ష్మీపురం, మెయిన్ రోడ్డు, ముత్తుకూరు రోడ్డు, నెల్లూరు.

• వెంకటగిరి

# రాజకీయం మారింది!



## కొమ్మి ఎంట్రీనే కారణం

వెంకటగిరిలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీకి నియోజకవర్గ ఇన్‌ఛార్జి ఎవరన్న సమస్య కొమ్మి లక్ష్మయ్యనాయుడు రాకతో తీరిపోయింది. పార్టీ ఆవిర్భవించిన నాటి నుంచి వెంకటగిరి నియోజకవర్గ బాధ్యతలు ఎవరికి అప్పగిస్తారో అనే చర్చ చాలా కాలంగా జరుగుతోంది. ఇటీవల పెంచలకోనలో జరిగిన ఒక కార్యక్రమంలో ఆ పార్టీ పెద్దలు కొమ్మికి గిరి బాధ్యతలు అప్పగించారు. దీంతో ఇక వెంకటగిరి నుంచి కొమ్మి రాజకీయాలు నెరపనున్నారు. ఇంతవరకు బాగానే వున్నా ఇప్పటివరకు అలిమిలి సురేష్‌రెడ్డి, వి.మోహన్‌లు వేరువేరుగా కార్యక్రమాలు నిర్వహిస్తూ వచ్చారు. వైఎస్ రాజారెడ్డితో సన్నిహిత సంబంధాలు కల్గిన వ్యక్తులుగా పార్టీ అభివృద్ధికి కృషి చేశారు. గత ఆరునెలలుగా సమితి మాజీ అధ్యక్షుడు పాపకన్ను రాజశేఖర్‌రెడ్డి వెంకటగిరికి వచ్చి పార్టీ కార్యక్రమాల్లో పాలుపంచుకొంటున్నాడు. వీరు నియోజకవర్గ ఇన్‌ఛార్జి పదవిపై ఆశలు పెట్టుకొని వున్నారు. ఈ పరిస్థితుల్లో కొమ్మి లక్ష్మయ్యనాయుడికి బాధ్యతలు అప్పగించడంతో పాపకన్ను, సురేష్‌రెడ్డి నిరాశ చెంది, పెంచలకోన సభకు గైర్హాజరయ్యారు. అక్కడ కార్యక్రమాలు చేపడుతున్న మోహన్ మాత్రం ఆ కార్యక్రమానికి హాజరై కొమ్మికి మద్దతు ప్రకటించడంతోపాటు కాకాణి గోవర్ధన్‌రెడ్డిని చందన మాలతో సత్కరించాడు. ఈ సమావేశానికి బాలాయపల్లి నుంచి ఆ పార్టీ కన్వీనర్ సింగంశెట్టి భాస్కర్‌రావు, వెంకటగిరి నుంచి ఆపార్టీ నేత బత్తినపట్ల వీరారెడ్డి భారీగా అనుచరులతో తరలివెళ్లారు. ఇక వెంకటగిరిలో కొమ్మి ఎలా ప్రజా సమస్యలపై పోరాడుతాడో పార్టీ అభివృద్ధికి ఎలా కృషి చేస్తాడో చూడాల్సి వుంది.


Statement about ownership and other particulars about the Newspaper

**ZAMIN RYOT (TELUGU WEEKLY)**

NELLORE - 524 001, ANDHRA PRADESH

**FORM - IV** (See Rule 8)

1. Place of Publication : D.No. 16/339, 2nd Floor, Venkataramana Vilas, Pogathota, NELLORE - 524 001
2. Periodicity of Publication : Weekly
3. Printer's Name : N. Dolendra Prasad; Nationality & Address : Indian, 16-3-629, Ramamurthy Nagar, NELLORE - 524 003
4. Publisher's Name, Nationality & Address : - do -
5. Editor's Name, Nationality & Address : - do -
6. Name and Addresses of the individuals who own the newspaper and partners or share holders holding more than one percent of the total capital.

**ZAMINRYOT COMMITTEE**

1. Sri T. Vanamali, Flat No:302, Himagiri Towers, Kalyan Nagar - Venture III Bus Stand, Mothi Nagar, Hyderabad - 500 018 : President
2. Sri N. Dolendra Prasad, 16-3-629, Ramamurthy Nagar, Nellore - 524 003 : Member
3. Sri N. Yamini Chandra, Zamin Ryot Bldgs., 1st Street, Chandramouli Nagar, NELLORE - 524 004 : Member
4. Sri N. Kosalaram, 4A, 1st Block, Kences Enclave, Ramakrishna Street, T.Nagar, CHENNAI - 600 017 : Member

I, N. Dolendra Prasad hereby declare that the particulars given above are true to the best of my knowledge.

**N. DOLENDRA PRASAD,** Publisher


# ఆధార్‌కార్డుతో లింకు పెట్టొద్దు!

ఆధార్‌కార్డుతో సంబంధం లేకుండా నిత్యావసర సరుకుల పంపిణీ, గ్యాస్ సరఫరా చేయాలని పౌరసరఫరాలశాఖ డిప్యూటి తహశీల్దార్ సత్యవతి రేషన్ డీలర్లను, గ్యాస్ ఏజన్సీలను ఆదేశించారు. ఇటీవల కలువాయి మండలంలో నిత్యావసర సరుకుల పంపిణీ, గ్యాస్ సిలిండర్ల సరఫరాపై తహశీల్దార్ కార్యాలయంలో సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆమె మాట్లాడుతూ నిత్యావసర సరుకులు, ఇతర పథకాలపై అందే రాయితీలను ప్రజలకు నేరుగా అందించేందుకు ఆధార్‌కార్డుతో అనుసంధానం చేసేందుకు ప్రభుత్వం కృషి చేస్తున్నాదన్నారు. ఈ ప్రక్రియలో కొంత జాప్యం కారణంగా కొన్ని చోట్ల ఆధార్‌కార్డులు జారీ కాలేదన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని ప్రభుత్వం ఆదేశాలు అందేవరకు ఆధార్‌కార్డుతో పనిలేకుండా నిత్యావసర వస్తువులను, గ్యాస్‌ను సరఫరా చేయాలన్నారు. అలా కాకుండా ఆధార్‌కార్డు కావాలని ఆంక్షలు పెట్టి వినియోగదారులను వేధిస్తే అలాంటి వారిపై కఠిన చర్యలు తీసుకొంటామని రేషన్ డీలర్లను, గ్యాస్ ఏజన్సీలను హెచ్చరించారు. ఈ సమావేశంలో తహశీల్దార్ మహమ్మద్ హుస్సేన్ తదితరులు పాల్గొన్నారు.




హైదరాబాద్‌లో జరిగిన పేలుళ్లను నిరసిస్తూ నెల్లూరులో శాంతి ప్రదర్శన చేస్తున్న నేతాజీ పైలెట్ స్కూల్ విద్యార్థులతో కరస్పాండెంట్ ఎమ్వీ సుబ్బారెడ్డి.

## ప్రమాదకరంగా ట్రాన్స్‌ఫార్మర్

### రుద్రకోటలో ఇదీ పరిస్థితి

కావలి రూరల్ మండలం రుద్రకోట పాఠశాల వద్ద వుండే విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్ ప్రమాదకరంగా వుంది. ఎలాంటి రక్షణ వలయం లేకుండా వుండడంతో పాఠశాలకు వెళ్లే చిన్నారులు భయపడుతున్నారు. ఎప్పుడు విద్యార్థులు ఏమరుపాటుగా వుండి ప్రమాదానికి గురౌతారోనని పిల్లల తల్లిదండ్రులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ట్రాన్స్‌ఫార్మర్ ఎత్తు పెంచాలని, తగిన రక్షణ చర్యలు చేపట్టాలని పాఠశాల ఉపాధ్యాయులు, విద్యార్థుల తల్లిదండ్రులు పలుమార్లు విద్యుత్‌శాఖ అధికారులకు తెలిపినా ఉపయోగం లేకుండా పోయిందట. ఏదైనా ప్రమాదం జరగక ముందే స్పందించాలని గ్రామస్తులు కోరుకొంటున్నారు.

# విష్ణుపై విమర్శలా!

### అనుచరుల ప్రతి విమర్శలు

మాజీ శాసనసభ్యుడు కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డిపై స్థాయి మరచి విమర్శలు చేయడం మానుకోవాలని కాంగ్రెస్‌పార్టీ నేత బొబ్బల శ్రీనివాస్‌యాదవ్, రత్తయ్యలు వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నేతలకు హితవు చెప్పారు. ఇటీవల అల్లూరులో విష్ణువర్ధన్‌రెడ్డి కార్యాలయంలో జరిగిన విలేకరుల సమావేశంలో వారు మాట్లాడారు. చాలా మండలాల్లో పలువురికి రాజకీయ బిక్ష పెట్టింది ఎవరో గుర్తు చేసుకోవాలన్నారు. అలాంటి విష్ణువర్ధన్‌రెడ్డిపై స్థాయి తెలుసుకోకుండా అవాకులు, చవాకులు మాట్లాడడం మానుకోవాలన్నారు. సొసైటీ ఎన్నికల్లో ఓటమిని తట్టుకోలేక వైఎస్ జగన్ పార్టీ నేతలు ఇలాంటి విమర్శలు చేస్తున్నారని ఖండించారు. ఆ పార్టీ నేతలే పలువురికి డబ్బు ఆశ చూపించారని ఆరోపించారు. ఇకనైనా విష్ణుపై విమర్శలు చేయడం మానుకోవాలని లేదంటే తగిన బుద్ధి చెపుతామని హెచ్చరించారు.

# పదరాగిణికి టిటిడి సహకారం!

ప్రాచీన తెలుగు సంపదను పదిలపరచేందుకు పదరాగిణి ట్రస్టు ద్వారా సంగీత గేయధార సృష్టికర్త, రాజకుటుంబీకుడు డాక్టర్ విబి. సాయికృష్ణ యాచేంద్ర కృషి చేస్తున్న విషయం తెలిసిందే. వీరు చేస్తున్న కార్యక్రమానికి ఇప్పుడు తిరుమల తిరుపతి దేవస్థానం సహకారాన్ని అందించేందుకు ముందుకు వచ్చింది. శహాజీ సంకీర్తనలు, పెద తిరుమాలాచార్యుల వచ

### ప్రాచీన తెలుగు సంపద ఇక పదిలం

నాలు, నీతిశతకం, కీర్తనలు, తరిగొండ వెంగమాంబ విరచిత రమా పరిణయం, శివనాటకం, తొలి వాగ్గేయకారుడు కృష్ణమాచార్యుల వచనాలు, తిరునామముల కీర్తనలు, కార్వేటి నగరానికి చెందిన వాగ్గేయకారుడు సారంగపాణి పద్యాలు, భక్తి గీతాలను మొత్తం పది సిడిలుగా ధ్వని ముద్రణ చేసేందుకు టిటిడి అనుమతిచ్చింది. ఈ సందర్భంగా యాచేంద్ర మాట్లాడుతూ ప్రాచీన పద సంపదను పదిలపరచడానికి టిడిపి ఇస్తున్న ప్రోత్సాహానికి కృతజ్ఞతలు తెలిపారు.

# ఎడాపెడా విద్యుత్ కోతలు!

### అల్లాడుతున్న వెంకటగిరి రైతులు

ఎడాపెడా విధిస్తున్న విద్యుత్ కోతలు, ట్రాన్స్‌ఫార్మర్లకు మరమ్మత్తులు చేయించకపోవడంతో పంటలు ఎండిపోతున్నాయని వెంకటగిరి రైతాంగం వాపోతుంది. విద్యుత్‌శాఖ అధికారుల తీరును నిరసిస్తూ రైతులు ఆందోళనకు దిగారు. వెంకటగిరి ఎడిఇ కార్యాలయం వద్దకు చేరుకొన్న రైతులు పంటలు నిలువునా ఎండిపోతుండడంతో ఆర్థికంగా నష్టపోతున్నామని ఆందోళన వ్యక్తం చేశారు. తమపై కనికరం లేకుండా అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని ఆగ్రహించారు. అధికారులు స్పందించి ట్రాన్స్‌ఫార్మర్లకు మరమ్మత్తులు చేయించాలని, విద్యుత్ సరఫరాలో అంతరాయం లేకుండా చూడాలని డిమాండ్ చేశారు. లేదంటే ఆందోళనను తీవ్రతరం చేస్తామని హెచ్చరించారు. ఈ నిరసన కార్యక్రమంలో వెంకటగిరి మండలంలోని పెట్లూరు, పూలరంగడిపల్లి, పెరియవరం, కెబిపల్లి, బండారుపల్లి, దగ్గవోలు, భీమవరం, బొప్పాపురం తదితర గ్రామాలకు చెందిన రైతులు అధికసంఖ్యలో పాల్గొన్నారు.

● కాంగ్రెస్‌కు

# 'జై' అంటున్న బీద!

### వైకాపా నేత ప్రతాప్‌కుమార్‌రెడ్డి విమర్శ

ప్రజా సమస్యలపై ప్రభుత్వాన్ని నిలదీయాల్సిన కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు అధికారపార్టీ వారితో అంటకాగుతున్నారని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కావలి నియోజకవర్గ ఇన్‌ఛార్జి రామిరెడ్డి ప్రతాప్ కుమార్‌రెడ్డి తీవ్రంగా విమర్శించారు. ఇటీవల కావలిలో జరిగిన విలేకరుల సమావేశంలో ఆయన బీదపై విరుచుకపడ్డారు. కావలికి ఏ కాంగ్రెస్ నాయకుడు వచ్చినా, మంత్రులు వచ్చినా ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు కాంగ్రెస్‌పార్టీ వారి కంటే ముందుంటున్నాడని ఎద్దేవా చేశారు. ఇటీవల ఇస్కపల్లి, కావలిలో జరిగిన మంత్రుల పర్యటనలను పరిశీలిస్తే ఈ విషయం అవగతమవుతుందన్నారు. తెలుగుదేశం పార్టీ ఎమ్మెల్యేనన్న సంగతి మరచి మంత్రులను పొగడడంలో మస్తాన్‌రావుకు మరెవరూ సాటిరారని విమర్శించారు. నియోజకవర్గ ప్రజలు ఆయన వ్యవహార శైలిని గమనిస్తున్నారన్నారు. సహకార ఎన్నికల్లో అధికార కాంగ్రెస్ పార్టీ, ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీలు లోపాయికారి ఒప్పందం చేసుకొని గెలుపు సాధించాయన్నారు. దీనికి నిదర్శనం అల్లూరు సహకార ఎన్నికలో టిడిపి, కాంగ్రెస్‌కు మద్దతు ఇవ్వడమేనన్నారు. ఇక రైతులకు కావలి కాలువ ద్వారా సాగునీరు ఇవ్వకుండా కాంగ్రెస్ ప్రభుత్వం అన్యాయం చేసిందన్నారు. వచ్చే శాసనసభ ఎన్నికల్లో జిల్లాలోని అన్ని అసెంబ్లీ స్థానాలలో వైకాపా అభ్యర్థులు విజయం సాధించడం ఖాయమన్నారు.

# బోగోలు పంచాయితీ స్థలం ఆక్రమణ!

ఏకంగా పంచాయితీ ఆఫీసు స్థలాన్ని ఆక్రమించిన వైనం బోగోలులో జరిగింది. ఈ కార్యాలయాన్ని ఆనుకొని వుండేవాళ్లు కొద్దికొద్దిగా స్థలాన్ని ఆక్రమిస్తూ, రాకపోకలకు పంచాయితీ కార్యాలయం వైపే వినియోగిస్తుండడంపై ఆరోపణలు వ్యక్తం అవుతున్నాయి. గతంలో పంచాయితీ స్థలం చుట్టూ బొంతరాయితో నిర్మించిన ప్రహరీగోడ వుండేది. కాలక్రమేణా ఆ గోడ కూలిపోయింది. తిరిగి గోడను నిర్మించడం ఆలస్యమయ్యింది. ఈ నేపథ్యంలో ప్రక్కనే నివసించేవాళ్లు ప్రహరీ గోడను వారే నిర్మించుకొన్నారు. అంతవరకు బాగానే వున్నా సాయిబాబా గుడి నిర్మాణానికని ఇంటి ద్వారాన్ని పంచాయితీ కార్యాలయం వైపు ఏర్పాటు చేసుకొన్నారు. ఆ తర్వాత అదే దారిన తిరగడానికి

### చోద్యం చూస్తున్న అధికారులు

వాడుకొంటుండడంపై పంచాయితీ అధికారులు ఆ ఇంటి యజమానులను ప్రశ్నిస్తే నిర్లక్ష్యంగా సమాధానం చెప్పడమే కాకుండా, ఆ మహిళ సిబ్బందిపై నోరు పారేసుకొందట. దీంతో అధికారులు కిక్కురుమనకుండా వుండడంతో ఆమె దర్జాగా పంచాయితీ స్థలాన్ని సొంతానికి వాడుకొంటోంది. దీనికి తోడు ఇంటి ముందు వున్న రోడ్డును ఆక్రమించేసుకొని వాహనాలు రాకపోకలను అడ్డుకొంటుండడంతో వాహనాలు నడిపేవారు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. దీనిపై ప్రజలు పలుమార్లు అధికారులకు తెలిపినా స్పందన లేకుండా పోయింది. కావలి ఆర్‌డిఓ ఈ వ్యవహారంలో కలుగజేసుకొని పంచాయితీ స్థలాన్ని, రహదారిని ఆక్రమణ చెర నుంచి కాపాడాలని కోరుకొంటున్నారు.



నెల్లూరు పొగతోటలోని ప్రభవ పాఠశాలలో చిత్రకళా ప్రదర్శనను ప్రారంభిస్తున్న ఆర్డీఓ మాధవీలత. ప్రక్కన స్కూల్ నిర్వాహకురాలు చంద్రలత.

● జిల్లాలో

# శాంతిభద్రతలు లేవు!

### తెలుగుదేశం జిల్లా నేత బీద రవిచంద్ర విమర్శ



జిల్లాలో శాంతిభద్రతలు పూర్తిగా క్షీణించాయని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర ఆందోళన వ్యక్తం చేశారు. ఇటీవల వెంకటగిరి వచ్చిన ఆయన ఆర్‌అండ్‌బి అతిథి గృహంలో విలేకరులతో మాట్లాడారు. జిల్లాలో శాంతిభద్రతలు క్షీణించడంతో ప్రజలు ఇళ్లలో నుంచి బయటకు రావాలంటేనే హడలిపోతున్నారన్నారు. దొంగతనాలు, హత్యలు, దోపిడీలతో ప్రశాంతతకు మారుపేరైన జిల్లాలో అశాంతి ఆవరించిందన్నారు. ముఖ్యంగా మహిళలు, విద్యార్థినులకు రక్షణ కరువైందన్నారు. పేద ప్రజలకు న్యాయం చేయాలని ఎస్పీ ఆదేశాలు జారీ చేస్తున్నా దిగువ స్థాయి సిబ్బంది పట్టించుకోకుండా పోలీస్ స్టేషన్లను సెటిల్‌మెంట్లకు వినియోగించుకొంటున్నారని విమర్శించారు. డిజిపి సొంత జిల్లాలోనే ఇలాంటి పరిస్థితులు ఎదురుకావడం దారుణమన్నారు. అలాగే రాష్ట్రప్రభుత్వం ప్రజాసమస్యలు గాలికి వదిలేసిందని విమర్శించారు. విద్యుత్ ఛార్జీలు పెంచడం, సర్‌ఛార్జీల పేరుతో అదనపుభారం మోపడంతో సామాన్యుల పరిస్థితి దారుణంగా వుందన్నారు. అధిక ధరలతో ప్రజలు సతమతం అవుతున్నా పట్టించుకోకపోవడం సిగ్గుచేటన్నారు. పెంచిన విద్యుత్ ఛార్జీలను వెంటనే రద్దు చేయాలని లేదంటే టిడిపి ఆధ్వర్యంలో ఉద్యమం చేపడుతామని హెచ్చరించారు. టిడిపి పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, ఇతరులు ఎస్పీ పని తీరుపై విరుచకపడుతుంటే రవిచంద్ర ఎస్పీపై విమర్శలు చేయకుండా క్రింది స్థాయి సిబ్బందిని టార్గెట్ చేయడంలో ఆంతర్యం ఏమిటా అని వెంకటగిరిలో చర్చ జరుగుతోంది. దీనికి రవిచంద్ర ఏమి సమాధానమిస్తారో?

# పేదల భూములు పెద్దల చేతుల్లో...

### పాపం వెంకటగిరి దళితులు

వెంకటగిరి ప్రాంతంలో దళితులు, గిరిజనులకు ఇచ్చిన భూములు భూస్వాముల కబంధ హస్తాల్లో చిక్కుకొని పోతున్నాయి. తమ భూములను తిరిగి ఇప్పించాలని గత కొంతకాలంగా ఈ ప్రాంతంలోని పేదలు అధికారులను వేడుకొంటున్నా ఫలితం లేకుండా పోతుంది. వెంకటగిరి మండలంలో పరిశీలిస్తే పాపమాంబాపురంలో గల సిజెఎఫ్ఎస్ భూములను కొన్నాళ్ల క్రిందట దళితులు, గిరిజనులకు సాగు చేసుకొనేందుకు పంచి పెట్టారు. వీటిని కొందరు భూస్వాములు దౌర్జన్యంగా ఆ భూములను స్వాధీనం చేసుకొని సాగు చేసుకొంటున్నారు. బయటి ప్రాంతాలకు చెందినవారు ఆర్థిక ఇబ్బందుల్లో వున్న పేదల అవసరాన్ని ఆసరాగా చేసుకొని క్రమంగా భూముల ఆక్రమణలకు పాల్పడ్డారు. కొందరు వారిని ఎదిరించి పంటసాగు చేసుకోగా దానిని నాశనం చేశారట. ప్రభుత్వం ఇచ్చిన కొద్దిపాటి సిజెఎఫ్ఎస్ భూములతో జీవనోపాధి పొందుతున్న పేదలకు భూస్వాముల అక్రమణల కారణంగా ఉపాధి లేకుండాపోయింది. దీనిపై పలుమార్లు రెవెన్యూ అధికారులను కలసి విన్నవించినా ఫలితం లేకుండా పోయిందని వాపోతున్నారు. తమకు న్యాయం చేయాల్సిన రెవెన్యూ అధికారులు భూస్వాములకే అండగా నిలుస్తూ, ఆ భూములకు పట్టాలు సృష్టించి ఇస్తున్నారని ఆరోపిస్తున్నారు. ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని తమ భూములు తమకు అప్పగించాలని పేదలు కోరుకొంటున్నారు.

# మంచి అలవాట్లతో ఆరోగ్యం!

### గొలగమూడి వెంకయస్వామి ఆశ్రమం ఇఓ

మంచి అలవాట్లతో, ఆహార నియమాలు పాటిస్తే చక్కని ఆరోగ్యం లభిస్తుందని, దీనితోపాటు ఆయుష్షు పెరుగుతుందని గొలగమూడి వెంకయ్యస్వామి ఆశ్రమం కార్యనిర్వహణాధికారి బాలసుబ్రహ్మణ్యం తెలిపారు. ఇటీవల నెల్లూరుకు చెందిన కమ్యూనిటి పారామెడికల్ ట్రస్టు ఆధ్వర్యంలో వెంకయ్యస్వామి ఆశ్రమ పాఠశాలలో వైద్యశిబిరం జరిగింది. ఈ సందర్భంగా ఇఓ మాట్లాడుతూ ట్రస్టు చేస్తున్న సేవలను కొనియాడారు. సేవా సంస్థలు ఆశయసిద్ధితో పని చేసినపుడే వాటికి సార్థకత లభిస్తుందన్నారు. ట్రస్టు నిర్వాహకులు రమణయ్య, వైద్యులు రసూల్, శ్రీనివాసులరెడ్డి మాట్లాడుతూ గొలగమూడి ఆశ్రమ అభివృద్ధికి ఇఓ చేస్తున్న కృషిని ప్రశంసించారు. ఈ కార్యక్రమంలో బాబు, గోపాలాచారి, రాఘవేంద్రరావు, జావీద్, అశోక్ తదితరులు పాల్గొన్నారు.

# కావలి హరిజనవాడ వాసుల ఇక్కట్లు!

కావలి పట్టణ పరిధిలో గల హరిజనవాడలో సమస్యలు తాండవిస్తున్నాయి. పేరుకపోయిన చెత్త, లోపించిన పారిశుధ్యం నడుమ పేదలు నివసించాల్సి రావడంతో తీవ్ర అవస్థలు పడుతున్నారు. పాలకులు, అధికారులు అభివృద్ధి మంత్రాన్ని పఠిస్తున్నప్పటికీ ఈ ప్రాంతం గురించి, ఇక్కడ వుండే ప్రజలకు మెరుగైన సౌకర్యాలు కల్పించడంలో దృష్టి సారించకపోవడంతో ఈ ప్రాంతం అభివృద్ధి నోచుకోవడం లేదు. ఈ ప్రాంతాన్ని ఆనుకొనే పెద్ద మురుగు కాలువ పోతోంది. చాలా కాలానికి కాలువ కట్టినప్పటికీ మూతవేయడం, ఇరువైపుల గోడలు కట్టడం మరచిపోవడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. వ్యాపారులు వ్యర్థాలను, చెత్తను ఇక్కడ

### పట్టని పాలకులు

పారవేయడంతో పరిస్థితి నానాటికి దిగజారుతోంది. దీంతో హరిజనవాడలో నివసించే వారు రోగాలతో సతమతం అవుతున్నారు. మరోవైపు కాలువకు రక్షణగోడలు కట్టకపోవడంతో రాత్రి సమయాల్లో వాహనాలపై వచ్చే వాళ్లు ప్రమాదాలకు గురౌతున్నారు. ఎమ్మెల్యే మస్తాన్‌రావు కాలువ ప్రక్కనే ఐదు లక్షలు రూపాయలతో రోడ్డు నిర్మించినప్పటికీ ఉపయోగం లేకుండా పోతోంది. ఈ ప్రాంతప్రజలు ఇబ్బందులను దృష్టిలో వుంచుకొని కాలువపై మూత వేయాలని, ఇరువైపులా గోడలు కట్టాలని స్థానికులు కోరుకొంటున్నారు.

# నింగికెగిసిన భారత కీర్తి!



పిఎస్ఎల్వి-సి20 ప్రయోగానికి ముందు ల్యాంచ్‌పాడ్ వద్ద రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీతో షార్ డైరెక్టర్ ప్రసాద్, ఇస్రో ఛైర్మన్ రాధాకృష్ణన్, ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి, గవర్నర్ నరసింహన్, కేంద్రమంత్రి నారాయణస్వామి, రాష్ట్ర ఆర్థికమంత్రి రామనారాయణ.

శ్రీహరికోట రాకెట్ కేంద్రం నుంచి తాజాగా ఆకాశంలోకి దూసుకువెళ్లిన పిఎస్ఎల్వి-సి20 రోదసీ నౌక భారత కీర్తి పతాకను మరొకసారి నింగిలో సగర్వంగా ఎగుర వేసింది. మొత్తం ఏడు ఉపగ్రహాలను ఒకేసారి రోదసీలోకి ప్రవేశ పెట్టింది ఈ నౌక. ఫ్రాన్స్ దేశపు సంయుక్త భాగస్వామ్యంలో తయారు చేసిన సరల ఉపగ్రహం అందులో కీలకమైనది. సముద్ర జలాలు, వాటిలో జీవించే జలచరాల కదలి కలపై పరిశోధనలకు ఉద్దేశించిన ఉప గ్రహం అది. పిఎస్ఎల్వి శ్రేణిలో ఇది 23వ ప్రయోగం. ఇన్ని విజయాలు వరస బెట్టి సాధించిన ఘనత చాలా అరుదైనది. అందువల్లనే రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ ఈ ప్రయోగం వీక్షించడానికి ప్రత్యేకంగా విచ్చేశారు. ఆయన ప్రసంగం సైతం శాస్త్రవేత్తల శ్రమను ప్రస్తుతించడం పైనే కేంద్రీకృత మైంది. ఈ విజయ పరంపరను జిఎస్ఎల్వి ప్రయోగం ద్వారా మరింత ఎత్తుకు తీసుకువెళ్లాలని ఆకాంక్షించారాయన.

రాకెట్ ప్రయోగం సమయంలో నెల్లూరు జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, శాసనమండలి సభ్యుడు వాకాటి నారాయణ రెడ్డి, నెల్లూరు నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డి త్రయం అంతా తామే నడిపిస్తున్నట్లు కన్పించారక్కడ. వారి హడావుడి చూస్తే పిఎస్ఎల్వి రాకెట్‌ను శాస్త్రవేత్తలు ఎగుర వేస్తున్నారో లేక వీరే స్విచ్ నొక్కుతున్నారా అన్న సందేహం కల్గింది. వారికిదొక ముచ్చట, మనకెందుకు లేండి.

# ప్రజాసేవకుడు సేతురామిరెడ్డి ఇకలేడు!

- **ప్రజా జీవితంలో ఉండాలనుకొనేవారికి ఆయన జీవితం ఓ పాఠం.**



ప్రజా జీవితానికి ప్రత్యక్ష నిర్వచనంగా జీవనం గడిపిన పాత తరం కమ్యూనిస్టు నాయకుడు గండవరపు సేతురామరెడ్డి ఆదివారం హైదరాబాదులోని తన మేనల్లుడి ఇంట్లో ప్రశాంతంగా కన్ను మూశారు. ఆయన వయస్సు 84 సంవత్సరాలు. చివరి రోజు వరకు తన పనులు తాను చేసుకొనే ఆరోగ్యంతో జీవించగలగడం సేతురామరెడ్డి గారి అదృష్టం.

నెల్లూరు నవాబుపేట ప్రాంతంలో సేతురామరెడ్డి పేరు తెలియని వారు, ఆయన సేవ పొందనివారు వుండరు. తెల్లవారి ఐదు గంటలకే వీధులలోకి వచ్చి, మునిసిపల్ కార్మికులు వీధులు, కాలువలు శుభ్రం చేస్తున్నారో లేదో పర్యవేక్షించడం దగ్గర నుంచి రాత్రి నిద్రపోయే వరకు ఆయనకు తెలిసిన పని – ప్రజా సేవ మాత్రమే. ఐదుసార్లు మునిసిపల్ కౌన్సిలర్‌గా గెలిచిన ఆయన తన పదవిని పూర్తిగా ప్రజలకే అంకితం చేసేవాడు. తన వార్డులోని ప్రజలు మునిసిపల్ ఆఫీసు గడప తొక్కవలసిన అవసరమే కల్గించేవాడు కాదు. అన్నీ పనులూ తానే చేసి పెట్టేవాడు. సైకిల్ మాత్రమే ఆయన వాహనం. 80ఏళ్ల వయస్సులో కూడా దానిపైనే తిరగడం విశేషం. సేతురామరెడ్డి స్వగ్రామం తోటపల్లిగూడూరు మండలంలోని చెన్నపల్లిపాళెం. స్థితివంతమైన కుటుంబమే. కానీ పుచ్చలపల్లి సుందరయ్య స్ఫూర్తితో కమ్యూనిస్టు పార్టీలో ప్రవేశించి, జీవితాన్ని దానికే అంకితం చేశాడు. అందుకోసం పెళ్లి, కుటుంబ బంధనాలు మానుకొన్నాడు. నిజాయితీ, నిర్భీతి, నిర్మొగమాటం ఆయన ఆభరణాలు. తన మరణం తర్వాత అంత్యక్రియలు, అపర కర్మలు చేయకూడదని, సంతాప సభ కూడా పెట్టకూడదని వీలునామా వ్రాశాడట.

శాంతా బయోటెక్ అధినేతగా, శాస్త్ర పరిశోధన రంగంలో సుప్రసిద్ధుడై, పద్మభూషణ్ బిరుదు కూడా సాధించిన వరప్రసాద్‌రెడ్డి ఆయన మేనల్లుడు. వారి కుటుంబానికి మా సంతాపం తెలియజేస్తున్నాము.



హైదరాబాద్ బాంబు పేలుళ్లలో కళ్లు పోగొట్టుకున్న వారి అవసరార్థం ఆరు కళ్ల జతలను నేత్రదాతల నుంచి సేకరించి హైదరాబాద్‌లోని చిరంజీవి ఐ అండ్ బ్లడ్ బ్యాంక్‌కు పంపుతున్న నెల్లూరు చిరంజీవి యువత గౌరవాధ్యక్షుడు రాజ్‌కుమార్, రవి, కృష్ణారెడ్డి.



నెల్లూరు డిసిఎంఎస్ ఛైర్మన్‌గా ఎన్నికైన ఏడుగుండ్ల సుమంత్‌రెడ్డి హైదరాబాద్‌లో ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిని కలిశారు. ప్రక్కన మందిపాటి ప్రవీణ్‌కుమార్‌రెడ్డి, పూండ్ల అచ్యుత్‌రెడ్డి వున్నారు.



నెల్లూరు కేంద్ర సహకార బ్యాంక్ ఉపాధ్యక్షునిగా ఎన్నికైన నల్లపరెడ్డి జగన్మోహన్‌రెడ్డిని గూడూరులో జరిగిన అభినందనసభలో సన్మానిస్తున్న కేంద్రమంత్రి పనబాక లక్ష్మి, కృష్ణయ్య దంపతులు.



సూళ్లూరుపేటలోని చెంగాళమ్మ దేవస్థానంలో నిత్యాన్నదాన పథకానికి 52వేల ఐదు వందల రూపాయల విరాళాన్ని తన తల్లితండ్రులు కె.సుబ్రహ్మణ్య నాయకర్, ఈశ్వరమ్మాళ్ జ్ఞాపకార్థం దేవస్థానం ఛైర్మన్ హర్షవర్ధన్‌రెడ్డికి అందిస్తున్న చెన్నై నుంగంబాకంకు చెందిన హంసవల్లి.

# దీపం సకల దేవతా స్వరూపం!



ఏ పూజలోనైనా దీపారాధన ముఖ్యమైన అంశం. ఏ దేవతను పూజించినా, ఏ దైవాన్ని అర్చించినా అందులో దీపం స్థానం విశిష్టమైనది. దీపంలో దేవతలు వున్నారు. శాంతి వుంది, కాంతి వుంది. అందుకే దీపారాధన భారతీయుల సాంప్రదాయం అయ్యింది. దీపేన సాధ్యతే సర్వం అని శాస్త్రవచనం. దీపంతో దేనినైనా సాధించవచ్చునన్నది దీని అర్థం. ఉభయ సంధ్యల్లో ఇంట్లో వెలిగించే దీపం ఐశ్వర్య కారకం అని ధార్మిక గ్రంధాలు బోధిస్తున్నాయి. దేవతలు ప్రకాశ స్వరూపులని, శుభానికి, జ్ఞానానికి, శాంతికి కాంతి సంకేతమని చాటి చెప్పే ఆర్షభావన దీప ప్రజ్వలనలో కనిపిస్తుంది. జ్యోతిని వెలిగించడం శుభారంభం. దీపారాధన ద్వారా తేజోమయులైన దేవతలు సంతోషిస్తారని పురాణాలు చెప్తున్నాయి. దివ్యత్వానికి ప్రతీకయైన దీపాన్ని వెలిగించడం ద్వారా పరంజ్యోతి అయిన పరమాత్మకు దగ్గర కావచ్చునేది ఒక భావన.

దీపం పరబ్రహ్మ స్వరూపం. అలాంటి దీపారాధన జరిగే ప్రదేశంలో మహాలక్ష్మి స్థిరనివాసమేర్పరుచుకొని వుంటుందని చెప్తారు. అందుకే దీపం లేని ఇళ్లు కళావిహీనమై, అలక్ష్మీ స్థానం అవుతాయంటారు. దీపారాధన లేకుండా దేవతారాధన చేయరు. దీపం వెలిగించే కుంది క్రింది భాగం బ్రహ్మ, మధ్య భాగం విష్ణుమూర్తి, ప్రమిద శివుడు, కుందిలో వేసే వత్తి, వెలుగు సరస్వతి, లక్ష్మీదేవిగా భావిస్తారు. అందుకే దీపం సకల దేవతా స్వరూపం అంటారు. ఆనందం, ఐశ్వర్యం అనే భావనకు దేవతారూపాన్నిస్తే అదే లక్ష్మీదేవి. దీప జ్యోతిని లక్ష్మీదేవిగా, జ్యోతిని లక్ష్మీ మూర్తిగా పూజించడం మన సాంప్రదాయం. శ్రీలక్ష్మి అనే మాటకు కాంతి, శోభ అనే అర్థాలున్నాయి.

దీపారాధన చేసే విషయమై అనేక వివరాలు చెప్తారు. శివుడికి ఎడమవైపున, విష్ణుమూర్తికి కుడివైపున దీపారాధన చేయాలని శాస్త్రాలు చెబుతున్నాయి. ఏ దేవుడికి, దేవతలకు ఎదురుగా దీపారాధన చేయడం నిషిద్ధం. దీపారాధన చేసే ముందు కుందిల్లో ముందుగా నూనె పోసి తర్వాతే వత్తులు వేయాలి. దీపారాధన చేసేటపుడు రెండు వత్తులు తప్పకుండా వుండాలి. వీటిని అగ్గిపుల్లతో నేరుగా వెలిగించకూడదు.



ఏకహారతిలో కర్పూరం వెలిగించి దానితోకాని, అడ్డవత్తిని ఏక హారతిలో వెలిగించి దాని సహాయంతో దీపారాధన చేయాలి. అలాగే అగరొత్తులు, కర్పూరం వెలిగించేటప్పుడు దీపారాధన నుంచి వెలిగించకూడదు అని శాస్త్రాలు చెప్తున్నాయి. దీపారాధన చేయగానే ఆ దీపానికి మూడు చోట్ల కుంకమపెట్టి అక్షింతలు వేయాలి. ఆవునెయ్యిలో సూర్యశక్తి నిండి వుంటుంది. దీనితో దీపారాధన చేయడం వల్ల ఐశ్వర్యం, ఆరోగ్యం, సుఖశాంతులు లభిస్తాయంటారు. ఇంటిలో గల తులసికోట ముందు మట్టిప్రమిదలో దీపారాధన చేస్తే దుష్టశక్తులు ఇంట్లోకి ప్రవేశించవని చెప్తారు. అలాగే ఆవు నెయ్యితో శ్రీ మహాలక్ష్మిని, నువ్వుల నూనెతో శ్రీ మహావిష్ణువును, సుబ్రహ్మణ్యేశ్వరున్ని, కొబ్బరినూనెతో మహాగణపతికి దీపారాధన చేసి పూజిస్తే సకల శుభాలు కలుగుతాయంటారు.

# వారఫలాలు

*తేది 2-3-2013 నుండి 8-3-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో గురువు; తులలో శని, రాహువులు; కుంభంలో వక్ర బుధుడు, కుజుడు, శక్రుడు, రవి 4తేది వరకు తదుపరి మీనంలో; తుల, వృశ్చిక, ధనుర్మకరాలలో చంద్రుడు సంచరిస్తారు.*



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

గ్రహానుకూలతల వల్ల సోదర, సోదరీ వర్గాల నుండి ఇచ్చిపుచ్చుకోవడాలుంటాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఆర్థిక విషయాలు సంతృప్తినిస్తాయి. కొన్ని విషయాలలోతలదూర్చకుండా వుండడం మంచిది. దూర ప్రయాణాలలో స్వల్ప ఆటంకాలెదురౌతాయి. ఖర్చులధికంగా వున్నా ప్రయోజనాలు పొందగలరు. విద్యార్థుల ప్రయత్నాలు ఫలిస్తాయి.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

తలపెట్టిన పనులలో శుభాశుభ మిశ్రమ ఫలితాలుంటాయి. చిన్న చిన్న ఆటంకాలున్నా అధిగమిస్తారు. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆదాయం బాగున్నా, ఖర్చులు కూడా సమానంగా వుంటాయి. రుణ విముక్తులౌతారు. విద్యార్థులు కార్యసిద్ధులు కాగలరు. కళా, క్రీడా రంగాలలోని వారు చేసే ప్రయాణాలందు సత్ఫలితాలుంటాయి. రాజకీయులకు గుర్తింపులు, హోదాలు సిద్ధిస్తాయి.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

చేపట్టిన పనులు సకాలంలో పూర్తవుతాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆశాజనకంగా వుంటుంది. ఆర్థికంగా నిలకడ కలిగి వుంటారు. కోర్టు, ప్రభుత్వ వ్యవహారాలు పూర్తవుతాయి. ఇంటాబయట అనుకూలతలుంటాయి. విద్యార్థులు తమ భవిష్యత్తుకు పునాదులు వేస్తారు. వ్యవసాయదారులు ఆర్థికంగా లాభాలు ఆర్జిస్తారు. కళా, క్రీడా రంగాలలోని వారికి తోటివారి ఆదరణ, ఆప్యాయతలుంటాయి.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

గ్రహ ప్రతికూలతలచే రాబోయే కాలంలో తీవ్ర అనారోగ్య సూచనలు, వస్తు, వాహన నష్టాలు, తోటివారితో విరోధాలేర్పడుట, రుణ బాధలు బాధిస్తాయి. వృత్తి, వ్యాపారాలలో చేసే ప్రయత్నాలలో ఆటంకాలుంటాయి. ఆర్థికస్థితి సామాన్యం. అన్ని విషయాలలో తగు జాగ్రత్తలవసరం. విద్యార్థులు తమ భవిష్యత్తుకై తగిన ప్రణాళికతో వ్యవహరించాలి. రాజకీయులకు సోదర వర్గాలతో పేచీలుంటాయి.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

గతవారం వలె మిశ్రమ ఫలితాలుంటాయి. తలపెట్టిన పనులలో ఆటంకాలు లేదా వాయిదాపడటం, ఆర్థిక అసమాన్యతలు, అవసరార్థం రుణాలు చేయుట, పరోక్ష శత్రువృద్ధి వుంటుంది. వృత్తి, వ్యాపారాలలోని వారికి తరచూ ఆటంకాలేర్పడగలవు. విద్యార్థులు తోటి విద్యార్థుల ఆంతరంగిక విషయాలకు దూరంగా వుండడం మంచిది. వ్యవసాయ, కళా, క్రీడా రంగాలవారు రుణ సౌకర్యం పొందగలరు.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

గతంలో తలపెట్టిన పనులన్నీ పూర్తవుతాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఆర్థిక విషయాలపై ముందు జాగ్రత్త అవసరం. కొన్ని పనులు దశాదిశ లేకుండా చేపట్టే సూచనలున్నాయి. విద్యార్థులకు అనుకూలం. వ్యవసాయదారులకు రుణ సౌకర్యం అవసరమౌతుంది. కళా, క్రీడలలోని వారు వృత్తి విషయాలలో అనుకూలతలు సాధిస్తారు. రాజకీయులకు భవిష్యత్తు ఆలోచనలు అవసరమౌతాయి.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

తలపెట్టిన పనులన్నీ పూర్తయి, హుషారుగా, ఉత్సాహంగా వుంటారు. ఆశ్చర్యకర సంఘటనలు చూస్తారు. కోర్టు వ్యవహారాలు పునఃసమీకరణ చేయడం లేదా పరిష్కార మార్గాలు చూడడం మంచిది. ప్రభుత్వ లేదా రాజకీయులచే ప్రయోజనాలు పొందగలరు. వ్యవసాయదారులకు అనుకూలంగా వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి వృత్తిపరమైన రాబడులు, ఖర్చుల అంచనాలు అవసరం.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

పనులన్నీ సకాలంలో పూర్తవుతాయి. చిరకాలంగా సాగుతున్న మీ మనోభీష్టాలు సాధించుకుంటారు. చిన్నతరహా వృత్తి, వ్యాపారాల వారు అన్నింటా లాభాలు చూస్తారు. దేవాలయ సందర్శన, ఆధ్యాత్మిక విషయాలపై ఆసక్తి వుంటుంది. ఇంట్లో కుటుంబ సభ్యులతో సంతోషంగా గడుపుతారు. సోదరీ, సోదరుల అనుకూలతలు సాధిస్తారు. విద్యార్థులు వ్యాసాంగాలు కొనసాగిస్తారు.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

గతవారం వలె తలపెట్టిన పనులలో వృద్ధి కనపడి, క్రమంగా సన్నబడుతుంది. మీ మనస్సులోని ఆంతరంగిక విషయాలను బహిర్గత పరచేటప్పుడు శ్రద్ధ అవసరం. సహస్ర కార్యక్రమాలకు దూరంగా వుండండి. విద్యార్థులకు పూర్వం వలె విద్యలలో విజయం. వ్యవసాయదారులకు రుణ సౌకర్యం అవసరమౌతుంది. రాజకీయులకు రాజకీయ మంతనాలు అవసరమౌతాయి.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

తలపెట్టిన పనులు నిదానంగా సాగుతాయి. రక్తసంబంధీకులతో విరోధాలుంటాయి. మీ ఆలోచనలలో మార్పు అవసరం. గతంలో ఏర్పడిన వ్యవహారాలు పరిశీలనకు రాగలవు. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికస్థితి సామాన్యంగా వుంటుంది. కోర్టులు, లిటిగేషన్ వ్యవహారాలకు దూరంగా వుండడం మంచిది. అన్ని రంగాల వారికి ఆదాయ, వ్యయాలపై ప్రత్యేకదృష్టి అవసరం.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

పనులలో ఆటంకాలు, సోదర, సోదరీమణులతో స్వల్ప వివాదాలు, రుణ, శత్రుభయం, ఆర్థిక ఇబ్బందులు వుంటాయి. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికస్థితి సామాన్యం, కోర్టు వ్యవహారాలు వాయిదా వేయడం మంచిది. వ్యవసాయ, కళా, క్రీడా రంగాల వారికి ఆదాయ వ్యయాలు సమానంగా వుంటాయి. రాజకీయులకు ఇతరుల ప్రమేయం వల్ల వాయిదా పడతాయి. ఈ రాశి వారికి ఓర్పు, నేర్పు అవసరం.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

పనులలో ఆటంకాలుంటాయి. ప్రతి అడుగు ఆచితూచి వేయవలెను. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి భాగస్వాములచే ఇబ్బందులు, ఆర్థిక అసమానతలుంటాయి. విద్యార్థులకు చదువుపై ప్రత్యేక శ్రద్ధ అవసరం. వ్యవసాయ, కళా, క్రీడా రంగాలలోని వారికి వ్యవహార భంగాలు, వాగ్దానాలకు దూరంగా వుండుట మంచిది. రాజకీయులకు అన్నింటా ఆటంకాలు, నిరుత్సాహం వుంటుంది.

## పంచాంగం

4తేది పూర్వాభాద్ర కార్తె.
8తేది శ్రీవైష్ణవ మాధ్వ ఏకాదశి.
9తేది శని త్రయోదశి.

**శుభ ముహూర్తాలు**

శుక్ర మౌఢ్యమి కారణంగా వివాహాది శుభ కార్యాలకు శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య కార్యక్రమాలకు శుభముహూర్తాలున్నాయి.

**మార్చి తిథులు**

**మాఘ బహుళ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 2 | శని | పంచమి | రా | 08.03 | గం.ల.వ |
| 3 | ఆది | షష్టి | సా | 06.16 | గం.ల.వ |
| 4 | సోమ | సప్తమి | సా | 04.22 | గం.ల.వ |
| 5 | మంగళ | అష్టమి | ప | 02.20 | గం.ల.వ |
| 6 | బుధ | నవమి | ప | 12.14 | గం.ల.వ |
| 7 | గురు | దశమి | ప | 10.05 | గం.ల.వ |
| 8 | శుక్ర | ఏకాదశి | ఉ | 07.57 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

# సలక్షణ వాస్తు లేకుంటే సవాలక్ష సమస్యలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*సి.ముఖేష్ — నెల్లూరు*

* *వాస్తు శాస్త్రాన్ని పాటించాలా?*

లక్షల నిర్మాణాల్లో సలక్షణమైన వాస్తు లేకపోతే సవాలక్ష సమస్యలు చుట్టుముడతాయి.

*డి.వి.ఆర్ — నెల్లూరు*

* *గ్రహశాంతి ప్రయత్నాలు చేస్తున్నాము. అయినా ఫలితం కనిపించడం లేదు.*

వెంటనే బాబును స్పెషలిస్టుకు చూపించండి. ఆ తర్వాత గ్రహశాంతి కోసం ప్రయత్నాలు చేయవచ్చు.

*డాక్టర్ శిరీష — బెంగుళూరు*

* *మూడు నెలలకొకసారి గృహంలో ఫలితాలు మారుతుంటాయి. ఎందువల్ల?*

వాస్తు పురుషుని స్థితి, గతి ప్రతి మూడు మాసాలకొకసారి మారడం వల్ల గృహంలో కూడా ఫలితాలలో మార్పు కనిపిస్తుంది.

*టి.ముకుందమాల — పెనుగొండ*

* *ముఖ్య గృహమునకు ప్రక్కల ఉప గృహాల్ని నిర్మించేటప్పుడు పాటించవలసిన సూత్రాలేవి?*

ముఖ్య గృహం చాలు(లైను) తప్పకుండా ఇతర గృహాలు నిర్మించాలి.

*బీరంగి సత్యం — అనంతపురం*

* *శంఖుస్థాపనకు శ్రేష్ఠమైన కొయ్యల్ని గురించి మీరు విన్నారా?*

కొయ్య(దారువులు)లలో సంద్రు కొయ్య శంఖుస్థాపనకు శ్రేష్ఠం. వివిధ వాస్తు గ్రంథాలలో రావి, మర్రి, జువ్వి, వేప, టేకు కర్రలు కూడా వాడవచ్చునని ఉన్నది.

*బి.వి.ఎన్.శాస్త్రి — తిరుపతి*

* *ఆలయం శిథిలమైన చోట గృహ నిర్మాణం చేయవచ్చునా?*

చేయకూడదు. స్థలాన్ని శుభ్రపరచి తిరిగి ఆలయ నిర్మాణం చేసిన వారికి సకల దేవతాశీస్సులు లభ్యమని వాస్తు చింతామణి చెబుతున్నది.

*డాక్టర్ ఆర్.ప్రసాదరావు — బెంగుళూరు*

* *వధూవర వివాహానికి ఇరవై ఎనిమిది శాస్త్ర అంశాలను చూడాలంటారా?*

చూస్తే మంచిదే! అన్నీ కుదరాలంటే కష్టమే మరి. శాస్త్రమే సమస్యలకు పరిష్కారాలు చెబుతోంది. అందువల్ల నక్షత్రమునకు శత్రు నక్షత్రం, వేధో నక్షత్రం గృహాల్లో శత్రు గ్రహ పరిస్థితి చూస్తే చాలు.

*జి.శ్రీశైలం — కర్నూలు*

* *గృహ దోషాలు సరి చేయడం ఇప్పట్లో జరిగే పనికాదు. సలహా యివ్వండి?*

ఇంటి దిక్కు, గృహ దోషాలు గణనచేసి వెనువెంటనే వచ్చే యంత్రాన్ని ప్రతిష్టించుకోండి. ఆరు మాసాలలోగా దోషాలు సవరించుకోండి. పరిస్థితి చక్కబడుతుంది.

*షేక్ లాల్‌జాన్‌బాషా — నెల్లూరు*

* *వెండి, బంగారు దుకాణం ఏ సమయాల్లో ప్రారంభించాలి?*

విదియ, తదియదిగాగల తిథుల్లో అశ్వని, స్వాతి, ఉత్తర త్రయం, శ్రవణ, రేవతి నక్షత్రాల్లో, సోమ, బుధ, గురు, శుక్రవారాలు శుభప్రదమైనవని పెద్దలు చెబుతారు.

*ఎన్.సుభాషిణి — తిరుత్తణి*

* *వారఫలాల్లో తిథి, నక్షత్రాలు తెలియనితనం కనిపిస్తున్నది?*

జ్ఞానాన్ని అనుసరించే అజ్ఞానమూ ఉంటుంది. నడక నేర్చుకునేటప్పుడు తగిలే దెబ్బలే వాళ్లకు నిబద్ధతను నేర్పుతాయి.

*జె.తిరుపతిరావు — చిత్తూరు*

* *వివాహ విషయంలో శాస్త్రం ఒక్కటే సరిపోదంటారా?*

ఛాందసాలకు, భేషజాలకు పోతే ఈ మాట నిజం కూడా. అవసరమైన శాస్త్రాంశాలతోబాటు యజమానుల, వధూవరుల సంస్కారాల్ని కూడా బేరీజు వేయడం ఈ విషయంలో చాలా అవసరం.

*కె.ఉమాదేవి — నెల్లూరు*

* *వాస్తు లోపాలో, జ్యోతిష ప్రభావాలో తెలియదు. మేము చాలా ఆపదలో ఉన్నాము.*

భయపడి చేయగలిగిందేమీ లేదు. శాస్త్రంలో సమస్యకు పరిష్కారాలున్నాయి. వాటి కోసం ప్రయత్నించి, పరిష్కరించుకోవాలి. మీరు వెంటనే నిర్ధారించబడిన 'వాస్తు యంత్రం' ప్రతిష్టించుకోండి.

### ● స్థానిక సంస్థల ఎన్నికల ప్రకటనతో

# గ్రామాల్లో వేడెక్కిన రాజకీయం!




**● గ్రామ పంచాయితీలకు ఎన్నికలు నిర్వహించనున్నట్లు ప్రకటనలు వెలువడడంతో గ్రామీణ ప్రాంతాల్లో రాజకీయం వేడెక్కింది. రెండేళ్లుగా ఈ ఎన్నికల కోసం చోటామోటా నాయకులు చకోర పక్షుల్లా ఎదురు చూస్తున్నారు.**

గ్రామ పంచాయితీ ఎన్నికలకు సుప్రీంకోర్టు గ్రీన్‌సిగ్నల్ ఇవ్వడంతో అధికార యంత్రాంగం ముందస్తు ఏర్పాట్లు చేసుకునే పనిలో పడింది. 2011 సంవత్సరం ఆగష్టు నెలలో గ్రామపంచాయితీల పాలకవర్గం గడువు ముగిసింది. అప్పటినుంచి ప్రత్యేకాధికారుల పాలనలోనే గ్రామపంచాయితీలు నెట్టుకొస్తున్నాయి. మూడునెలల్లోగా స్థానిక సంస్థలకు ఎన్నికలు నిర్వహించే అవకాశం వుంది. ఎన్నికలకు సంబంధించిన పూర్తి వివరాలను సేకరించి అందజేయాలని పంచాయితీరాజ్‌శాఖ నుంచి జిల్లాకు ఉత్తర్వులు అందాయి. గ్రామపంచాయితీలకు 2001వ సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం రిజర్వేషన్ వర్తింప చేయనున్నారు. 60శాతం వరకు ఎస్సీ, ఎస్టీ, బిసీలకు రిజర్వేషన్ అమలు కానుంది.

రాష్ట్ర హైకోర్టు 50శాతానికి మించి స్థానిక సంస్థల్లో రిజర్వేషన్ కల్పించరాదని పేర్కొన్న విషయం తెలిసిందే. దీనిపై రాష్ట్రప్రభుత్వం సుప్రీంకోర్టును ఆశ్రయించడంతో ఎన్నికల వరకు మాత్రమే రిజర్వేషన్ అమలు చేయాలని ఆదేశాలిచ్చింది. దీంతో స్థానిక సంస్థల ఎన్నికలకు నిర్వహించేందుకు మార్గం ఏర్పడింది. అయితే ఎన్నికల ప్రక్రియకు సంబంధించి ఏర్పాట్లను పూర్తి చేస్తారు. వీలైనంత త్వరగా నిర్వహించేందుకు కృషి చేస్తామని ఎన్నికల సంఘం ప్రకటించింది. 2001 జనాభా లెక్కలను పరిగణలోకి తీసుకొని రిజర్వేషన్లు ఖరారు చేస్తారు. 2006 సంవత్సరంలో మండలం, జిల్లా పరిషత్‌లకు ఏ విధంగా ఎన్నికలు జరిపారో అదే విధంగా ఇప్పుడు కూడా ఎన్నికలు నిర్వహించాలని ప్రభుత్వం భావిస్తుంది. తొలుత గ్రామపంచాయితీలకు ఎన్నికలు జరిపి మలి విడతలో జిల్లా, మండల పరిషత్‌లకు నిర్వహించే అవకాశం వుంది.

## ఎన్నికలపై చర్చలు

గ్రామ పంచాయితీలకు ఎన్నికలు నిర్వహించనున్నట్లు ప్రకటనలు వెలువడడంతో గ్రామీణ ప్రాంతాల్లో ఎన్నికలపై చర్చలు మొదలయ్యాయి. 2009 సంవత్సరంలో జరిగిన అసెంబ్లీ ఎన్నికల తర్వాత ఉప ఎన్నికలు తప్ప ఇతర ఎన్నికలు జరగలేదు. దాదాపు రెండు సంవత్సరాల నుంచి స్థానిక ఎన్నికల కోసం గ్రామీణ ప్రాంతాల ప్రజలు ఎదురు చూస్తున్నారు. ప్రధానంగా ద్వితీయశ్రేణి రాజకీయనేతలు ఈ ఎన్నికల పట్ల ఆసక్తి చూపుతున్నారు. ప్రధాన రాజకీయ పార్టీలు కూడా త్వరలో జరగనున్న స్థానిక సంస్థల ఎన్నికలపై దృష్టి సారించాయి. గ్రామాల్లో కొంతమేర ప్రజలతో సంబంధం కలిగి వున్న నేతలను సర్పంచ్‌లుగా నిలబెట్టాలన్న ఆలోచనతో వున్నారు. స్థానిక సంస్థల ఎన్నికలను రాజకీయ ప్రమేయం లేకుండా నిర్వహించాలని ఎన్నికల సంఘం భావిస్తుంది.

రాజకీయ పార్టీల నుంచి తగిన గుర్తింపు పత్రాలు లేకుండా సర్పంచ్‌లను బరిలోకి దింపి ఎవరు గెలిస్తే వారిని తమ పార్టీ అభ్యర్థులుగా ప్రకటించుకునే అవకాశం వుందని రాజకీయ విశ్లేషకులు అభిప్రాయపడుతున్నారు. ఇటీవల జరిగిన సహకార, మార్కెటింగ్ సొసైటీల్లో ఇదే విధానం కనిపించింది. మూడు నెలల వ్యవధిలో గ్రామ పంచాయితీ ఎన్నికలు నిర్వహించాలని ప్రభుత్వం భావిస్తున్నా అందుకు తగినట్లుగా ఇతర వ్యవహారాలు చక్కబెట్టడం కష్టతరమని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. ఓటరు జాబితా రూపొందించడం, గుర్తింపు కార్డులు జారీ చేయడం, ఎస్సీ, ఎస్టీ, బిసిలకు వార్డులను కేటాయించడం వంటి పనులు ముందుగా పూర్తి చేయాల్సి వుంటుంది. ఇందుకు అధికార యంత్రాంగం ఏ మేరకు ఏర్పాట్లు చేస్తుందో వేచి చూడాలి.

మొత్తం మీద స్థానిక సంస్థల ఎన్నికల ప్రకటనతో గ్రామాల్లో వాతావరణం వేడిక్కింది. రాజకీయ పక్షాలు సైతం స్థానిక ఎన్నికలపై సమీక్షలు జరుపుతున్నాయి.

**తగువులు - తంటాలు**

# వివాదాలు ముదిరి వీధినపడుతున్న రెవిన్యూ శాఖ!




జిల్లా రెవిన్యూ శాఖలో అంతర్గత విభేదాలు ముదిరిపోతున్నాయి. అధికారులు, సిబ్బంది మధ్య శాఖాపరంగా తరచూ సమస్యలు ఏర్పడుతున్నాయి. రెవిన్యూశాఖలో రాజకీయ జోక్యం చోటుచేసుకోవడం వలన అధికారులు, సిబ్బంది రెండు వర్గాలుగా ఏర్పడ్డారు. ప్రజలకు ఏ సమస్య వచ్చినా రెవిన్యూశాఖ అధికారులు స్పందించాలి. ఇతర శాఖల కంటే ఈ విషయంలో రెవిన్యూశాఖకు ఎక్కువ బాధ్యతలు వుంటాయి. ప్రజా సమస్యలపై దృష్టి సారించాల్సిన ఈ శాఖ అధికారులు, వాటిని గాలికొదిలేస్తున్నారు. అక్రమ సంపాదన కోసం అడ్డదారులు తొక్కుతున్నారు. రాజకీయ నేతలకు అనుకూలంగా వ్యవహరిస్తూ ప్రజలను ఇబ్బంది పెడుతున్నారన్న ఆరోపణలు వున్నాయి. దీంతో పరిపాలన గాడి తప్పుతోంది.

గ్రామాల్లో వున్న ప్రభుత్వ భూములను గురించి వారి పరిరక్షణ కోసం చర్యలు తీసుకోవాల్సిన తహశీల్దార్లు వాటిని పట్టాభూములుగా చూపించి రియల్ ఎస్టేట్ వ్యాపారులకు విక్రయించేందుకు సహకరిస్తున్నారన్న విమర్శలు లేకపోలేదు. క్షేత్రస్థాయిలో సమగ్ర విచారణ జరపాలని జిల్లా స్థాయి అధికారులు పదే పదే సమీక్షా సమావేశాలు నిర్వహించి తహశీల్దార్లను ఆదేశిస్తున్నా ఏ ఒక్కరూ ఖాతరు చేయడం లేదు. ఇందుకు ఉదాహరణగా తడ తహశీల్దారు కార్యాలయాన్ని పేర్కొనవచ్చు. ఈ మండల కార్యాలయంలో సిబ్బంది ఒక వర్గంగానూ, తహశీల్దారు మరో వర్గంగానూ విడిపోయారు. రెండు రోజుల పాటు సిబ్బంది, విఆర్వోలు విధులకు హాజరు కాలేదు. ఇందుకు తహశీల్దారు అవలంభిస్తున్న వైఖరే కారణమని ప్రకటించారు. అక్రమంగా భూములను ఇతరులకు కట్టబెట్టి సిబ్బందిని బలి పశువులను చేస్తున్నారంటూ తహశీల్దార్‌పై ఆరోపణలు చేశారు.

జిల్లాలోని 46 మండలాల్లో ఇదే పరిస్థితులు వున్నా గుట్టుచప్పుడు కాకుండా సర్దుకపోతున్నారు. తహశీల్దార్లు, సిబ్బంది ఒకరిపై మరొకరు విమర్శలు, ఆరోపణలు చేసుకుంటుండడంతో రెవిన్యూశాఖ పరవు బజారునపడింది. జిల్లా కలెక్టరేట్‌లో ప్రతి సోమవారం నిర్వహించే ప్రజావిజ్ఞప్తుల కార్యక్రమంలో భూ వివాదాలకు సంబంధించి పలు వినతి పత్రాలు అందుతున్నాయి. వీటిని పరిష్కరించాలని జిల్లా కలెక్టర్ ఆయా మండల తహశీల్దార్లకు పంపుతున్నా పట్టించుకునే దిక్కు లేకుండా పోయారు. వీటిపై తిరిగి జిల్లాస్థాయిలో సమీక్ష చేయకపోవడంతో భూ వివాదాలు ముదిరిపాకానపడడమే కాకుండా ఘర్షణలకు దారితీస్తున్న సంఘటనలు అనేకం వున్నాయి. రెవిన్యూ శాఖలో ఏర్పడిన అంతర్గత విభేదాలను అసోసియేషన్ నేతలు తమకు అనుకూలంగా మలచుకుని ఒక వర్గం వారికే అండగా నిలుస్తుంటారు.

అవినీతి, అక్రమాల గురించి కలెక్టర్, జాయింట్ కలెక్టర్ల దృష్టికి వచ్చినా కూడా సరైనవిధంగా స్పందించలేక పోతున్నారు. రెవిన్యూ సర్వీసెస్ అసోసియేషన్ నేతలు రంగంలోకి దిగి తమ అసోసియేషన్ సభ్యులకు వత్తాసు పలుకుతుంటారు. తడ తహశీల్దారు విషయంలో విఆర్వోల సంఘం ఘాటుగానే స్పందించింది. అవసరమైతే జిల్లావ్యాప్తంగా విధులను బహిష్కరించేందుకు వెనుకాడబోమని ప్రకటన కూడా చేశారు. రెవిన్యూ సేవలు స్తంభించి ప్రజలు పలు ఇబ్బందులు పడుతున్నా జిల్లా కలెక్టర్, జాయింట్ కలెక్టర్లు మౌనంగా వుండిపోవడం చర్చనీయాంశంగా మారింది. ఇప్పటికే జిల్లాలో అన్నీ శాఖల్లో పరిపాలన స్తంభించింది. వివిధ సమస్యలపై కార్యాలయాలకు వస్తున్న ప్రజలకు సరైన సమాధానం చెప్పేవారు కరువయ్యారు.

జిల్లాలో వున్న అన్నీ ప్రభుత్వ శాఖల పని తీరును గాడిలో పెట్టాల్సిన జిల్లా కలెక్టర్ ఈ బాధ్యతలను డిఆర్వో, జాయింట్ కలెక్టర్లకు అప్పగించడంతో సమస్యలు మరింత జఠిలమవుతున్నాయి. ఏ సమస్యపై ఎవరు వెళ్లినా పై ఇద్దరు అధికారులను కలవాలని సూచిస్తున్నారు. దీంతో జిల్లా కలెక్టర్‌పై సామాన్య ప్రజానీకంలో నమ్మకం సన్నగిల్లే అవకాశం ఏర్పడింది. మొత్తం మీద రెవిన్యూ శాఖలో చోటు చేసుకున్న వివాదాలను ఎవరు పరిష్కరిస్తారన్నది ప్రశ్నగా మిగిలిపోయింది.

J

# జబర్‌దస్త్‌గా లేదు!



అల్లూరు రహీం

తెలుగు సినీ పరిశ్రమలో ప్రస్తుతం ఏకైక మహిళా దర్శకురాలు బి.వి.నందినీరెడ్డి. ఆమె ఇంతకు ముందు తీసిన అలా మొదలయ్యింది చిత్రం బాగా ఆడడంతో మంచి గుర్తింపు వచ్చింది. ద్వితీయ యత్నంగా ఆమెకు శ్రీసాయి గణేష్ ప్రొడక్షన్స్ పతాకంపై సీనియర్ నిర్మాత బెల్లంకొండ సురేష్ జబర్‌దస్త్ సినిమా తీసే అవకాశం ఇచ్చాడు. అయితే ఈ చిత్రం పేరుకు తగ్గట్టు జబర్‌దస్త్‌గా లేదు. దీనికి కారణం దర్శకురాలేననాలి. ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు నందినీరెడ్డి నెరిపారు. ఆమె వ్రాసుకున్న కథ బలహీనంగా వుంది. దీంతో స్క్రీన్‌ప్లేతో లాక్కొని వచ్చే ప్రయత్నంలో అడిషనల్ స్క్రీన్‌ప్లే అంటూ కోన వెంకట్ వంటి సీనియర్ రచయిత చేయి పెట్టనిచ్చారు. మరో రచయిత వెలిగొండ శ్రీనివాస్ చేత మాటలు వ్రాయించారు. కామెడీ తరహాలో చిత్రాన్ని నడిపే ప్రయత్నంలో ద్వితీయార్థంలో చిత్రం బలహీనమయ్యింది. ఇప్పటివరకు తెలుగులో హిట్ చిత్రాలేగానీ ఫట్‌లు లేని హీరోయిన్ సమంత, ఐరన్‌లెగ్ హీరోగా పేరు తెచ్చుకొన్న సిద్దార్థ్ ప్రక్కన జోడి కావడంతో ఆయన ప్రభావం ఆమెపై జబర్‌దస్త్‌గా పడి పోయింది.

ఈ సినిమాలో ఆడియో సూపర్ హిట్ అని ఊదరే తప్ప తెరపై లష్కర్ పోరిచూడు, అల్లా... అల్లా పాటలు మినహా మిగతావి జనాన్ని మెప్పించలేదు. అల్లా అల్లా చరణంతో సాగే పాటను ఖవ్వాలి తరహాలో తీశారు. దీన్ని వ్రాసిన రామజోగయ్య శాస్త్రి గారు పాటలో జిల్వా(శోభనం) పదాన్ని జల్వా(దహనం)గా వ్రాశారు. దీన్ని భాషా దోషంగా భావిద్దామా? చిత్రం మొదలవ్వగానే హీరోలోని ప్రత్యేక లక్షణాలు మరో హీరో సునీల్ చేత చెప్పించారు. ఒక మహిళా దర్శకురాలు సినిమా తీస్తూ మహిళల బాత్రూంలో ఓ మగాడు దూరితే అక్కడే పది నిమిషాలు సన్నివేశం నడపడం అవసరమా? పైపెచ్చు లేడీస్ టాయిలెట్ నా జీవితాన్ని మార్చేసిందన్న వెధవ డైలాగు ఒకటి. ఈ చిత్రంలో ఇన్‌డైరెక్ట్‌గా సమంత హీరో సిద్దార్థ్‌కు ముద్దు ఇస్తుంది. కానీ దీన్ని అంత బాగా దర్శకురాలు చిత్రీకరించలేక పోయింది. ఈ సినిమాలో హీరోయిన్ నిత్యమీనన్ మోసగత్తెగా కురచ పాత్రలో నటించడానికి నందినీరెడ్డిపై గురుభక్తి కారణంగా కనిపించింది. కొజ్జాలను పోలిన డ్యాన్స్ మాస్టర్లుగా ధర్మవరపు సుబ్రహ్మణ్యం, వేణులు అసహ్యంగా ఉన్నారు. తాగుబోతు రమేష్ పాత్ర పేలలేదు. వెలిగొండ శ్రీనివాస్ వ్రాసిన మాటల్లో పైకి రావాలంటే ఎవరో ఒకర్ని తొక్కాలి. ఆడవాళ్ల కళ్లు నిజం చెబుతాయి. త్రీడి రాక్షసి, బతికి ఉన్నప్పుడు మనిషిని ఎవరూ పట్టించుకోరు ఆలోచింపజేస్తాయి.




చిత్ర కథలోనికివెళ్తే బైర్రాజు(సిద్దార్థ్) పరమ బేవార్సు. హైదరాబాద్ నుంచి అప్పులు, మోసాల ప్రహసనం మొదలు పెట్టి బీహార్ వరకు విస్తరిస్తాడు. అక్కడ యాదవ్(షాయాజీ షిండే) చెల్లెల్ని పెళ్లి చేసుకొంటానని మోసం చేసి మళ్లీ హైదరాబాద్ వస్తాడు. ఓ పెళ్లిలో దొంగ భోజనం లాగించను వెళ్లే బైర్రాజుకు మహిళల బాత్రూంలో పైకిరాను శ్రేయ(సమంత) చెప్పే ఐడియా నచ్చుతుంది. దీంతో ఈ ఐడియాతో పెళ్లిళ్లు, ఫంక్షన్ల నిర్వహణను చూసే కంపెనీ అధినేత పింకీశర్మకు బైర్రాజు ఐడియా చెప్పి ఆమె దగ్గర ఉద్యోగం సంపాదిస్తాడు. ఇక్కడే ఇంటర్వ్యూకు వచ్చి ఉండే శ్రేయ తాను బాత్రూంలో చెప్పిన ఐడియా లీకేజి గూర్చి బైర్రాజును నిలదీస్తుంది. అతను తప్పు ఒప్పుకోవడంతో తాను అతనితో కలసి పనిచేయను సిద్ధపడుతుంది. కొన్నాళ్లకు శ్రేయ, బైర్రాజు కలసి స్వంతంగా ఈవెంట్లు నిర్వహించే సంస్థ పెట్టుకొని కలసి రావడంతో బాగా ఎదుగుతారు. ఈ సమయంలోనే శ్రేయ, బైర్రాజును ఎంతగానో ప్రేమిస్తుంది. ఈ విషయం అతనికి చెప్పను వెళ్లినప్పుడు తాగి పిచ్చివాగుడు వాగుతాడు. దీంతో అతనితో ఆమె తెగతెంపులు చేసుకొంటుంది. బైర్రాజు స్వంతంగా ఈవెంట్ల నిర్వహణ సంస్థ పెడతాడు. దీనిలో సరస్వతి(నిత్యమీనన్) వచ్చి చేరుతుంది. అక్కడ నుంచి కథ పలు మలుపులతో సుఖాంతమవుతుంది. హీరో సిద్దార్థ్‌ను నటనాపరంగా వేలెత్తి చూపలేం. కామెడీతోపాటు డ్యాన్స్ చేయడం, కళ్లతో కొన్ని భావాలను వ్యక్తం చేయడంలో హీరోయిన్ సమంత వెనుకబడినట్లనిపిస్తుంది. దర్శకురాలు నందినీరెడ్డి స్క్రీన్‌ప్లే వ్యవహారంలో ఇంకాస్త కసరత్తు చేసి ఉంటే జబర్‌దస్త్ పేరుకు తగినట్లే ఉండేది.

## ముద్దివ్వ లేదు!



హీరోయిన్ తాప్సి ముద్దు పెట్టే సన్నివేశంలో నటించిందా? ఈ విషయంపైనే చిత్రసీమలో వాడివేడి చర్చ నడుస్తోంది. తాప్సి కథానాయిక నటించిన చిత్రం గుండెల్లో గోదారి. ఇందులో తాప్సి, హీరో ఆది మధ్య ఒక ముద్దు సన్నివేశం ఉందన్న వార్త బయలుదేరింది. ఇదే విషయాన్ని తాప్సిని అడిగితే ముద్దా? నేను ఇంతవరకు ఏ సినిమాలోనూ లిప్‌లాక్ ఇచ్చింది లేదు. ఇలాంటి వార్తలు ఎలా వస్తాయో నాకు అర్థం కాదు. గుండెల్లో గోదారి ఓ స్వచ్ఛమైన ప్రేమకథ. రొమాన్స్ ఉంటుంది కానీ... అది ఈ తరహాలో కాదు. కథకు ఏం అవసరమో, ఎంత అవసరమో అంతే చేయాలి. మసాలా కోసం వేరే దారులు వెతుక్కోవాల్సిన అవసరం లేదు. కథకు ఇబ్బంది కల్గితే అటువంటి సినిమాను ప్రేక్షకులు చూడరంది.

## బాద్‌షాలో యంగ్ స్టార్‌లు!

అతిధిపాత్రలో హీరో, హీరోయిన్లు చటుక్కున మెరిసే సంప్రదాయం తెలుగు సినిమాల్లో ఎప్పటినుంచో ఉంది. తాజాగా రామ్‌చరణ్ ఎవడు చిత్రంలో అల్లు అర్జున్ గెస్ట్ అప్పియరెన్స్‌గా కనపడతాడు. ఎన్టీఆర్ బాద్‌షా చిత్రంలో సిద్దార్థ్ అతిధిగా అలరిస్తారు. ఈ చిత్రంలో నవదీప్ విలన్‌గా నటిస్తున్నాడు. బాద్‌షాలో సిద్దార్థ్ కనిపించే విషయాన్ని గోప్యంగా ఉంచారు. ఎన్టీఆర్ చిత్రంలో ఇంతమంది యంగ్ హీరోలు ఎందుకు నటిస్తున్నారా అన్నది ప్రేక్షకులకు అర్థం కాని సమస్య. దర్శకుడు శ్రీనువైట్ల కథను మెలికలు తిప్పే పనిలో వీరంతా వస్తున్నట్లు పోబిడి. చిత్రం విడుదలయ్యే సరికి ఇంకెంత మంది ఈ చిత్రంలో కనిపిస్తారో చూడాలి మరి.





## కొత్త విలన్!



విలన్లను ప్రక్క సినీపరిశ్రమ నుంచి దిగుమతి చేసుకోవడం కొత్తేం కాదు. పవన్‌కళ్యాణ్, తివిక్రమ్ శ్రీనివాస్ కాంబినేషన్‌లో తయారవుతున్న కామెడీ చిత్రంలో బొమన్ ఇరానీ విలన్‌గా నటిస్తారు. హిందీలో మున్నాభాయ్, త్రీ ఇడియట్స్ సినిమాలు చూసిన వారికి బొమన్ ఇరానీ గూర్చి ప్రత్యేకంగా చెప్పక్కరలేదు. హాస్యం, భావోద్వేగం, విలనిజం పండించడంలో నేర్పరి ఆయన. పవన్–బొమన్ ఇరానీ కాంబినేషన్‌లో పొలాచ్చీలో సన్నివేశాలు తెరకెక్కిస్తున్నారు. దీనికోసం బొమన్‌కు భారీ మొత్తంలో పారితోషికం ఇచ్చినట్లు ఫిల్మ్‌నగర్‌లో ప్రచారం జరుగుతుంది.

## హాట్‌హాట్ నీతూ!

నీతూచంద్ర... అప్పుడప్పుడూ టాలీవుడ్‌లో వినిపించే పేరు. గోదావరి సినిమాలో సుమంత్ మరదలిగా కనిపించింది. ఆ తర్వాత రాజశేఖర్‌తో సత్యమేవ జయతేలో నటించింది. తెలుగులో వెలిగింది తక్కువే. బాలీవుడ్‌లోనూ, తమిళ పరిశ్రమలోనూ అడపాదడపా అవకాశాన్ని అంది పుచ్చుకోగలుగుతోంది. ఇప్పుడు ప్రత్యేక గీతాలకు సై అంటోంది. 'ఢిల్లీబెల్లీ' సినిమాను తెలుగు, తమిళ భాషల్లో రీమేక్ చేస్తున్నారు. తెలుగులో దీనిపేరు నాటీబోయ్స్‌లో ఆర్య కథానాయకుడిగా నటిస్తున్న ఈ చిత్రానికి ఆర్.కణ్ణన్ దర్శకుడు. హన్సిక, అంజలి నాయికలు. ఈ సినిమాలోని ఓ ప్రత్యేక గీతంలో నీతూచంద్ర కనిపించనుంది. ఈ పాటలో నీతూ హాట్‌హాట్ గా నర్తించిందని సమాచారం. తమన్ స్వరాలు కూర్చిన ఈ సినిమా ఏప్రెల్‌లో విడుదలవుతుంది



## తగ్గిన ముమైత్!



ముమైత్‌ఖాన్ మళ్లీ ఫామ్‌లోనికి రావడానికి తంటాలు పడుతోంది. ఈ మధ్య కాస్త స్లిమ్‌గా మారడం వల్ల కొన్ని అవకాశాలు దక్కించుకొంది. గుండెల్లోగోదారిలో ఒక ప్రత్యేక గీతంలో నర్తించింది. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ మళ్లీ అవకాశాలు వస్తున్నాయి. పాటని ప్రేక్షకులకు చేరువ చేయడానికి నావంతు కృషి చేస్తున్నా. కెవ్వుకేకలో నేను నర్తించే పాట నిజంగానే కేక పెట్టిస్తుంది. నటిగానూ నిరూపించుకోవాలని ఉంది. మంచిపాత్రలు దొరికితే నటిస్తా. హిందీలోనూ అవకాశాలు వస్తున్నాయి. నాకంటూ వున్న బ్రాండ్ చెదరిపోకుండా సినిమాల్లో ముందుకు సాగుతానంటుంది.

# మద్దతు ధర లభించేనా?

జిల్లాలో ఈ ఏడాది రైతుల నుంచి ధాన్యాన్ని సేకరించేందుకు ధాన్యం కొనుగోలు కేంద్రాలను ఏర్పాటు చేశారు అధికారులు. జిల్లావ్యాప్తంగా వివిధ ప్రాంతాలలో 135 కేంద్రాలను రైతులకు అందుబాటులో వుంచారు. అంతవరకు బాగానే వున్నా మద్దతు ధర విషయంలో అన్నదాతలు ఆందోళన చెందుతున్నారు. సాగు వ్యయంగా మారింది. పెట్టుబడులు పెరగడం, దిగుబడులు తగ్గిపోవడం, ధరలు లేక రైతులు దిక్కుతోచని స్థితిలో వున్నారు. ఈ పరిస్థితులలో రైతుల నుంచి ధాన్యం కొనుగోలుచేసి వారికి మద్దతు ధర కల్పించేందుకు కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నా పెద్దగా ఫలితం వుండడం లేదు. రబీ సీజన్‌లో దాదాపు రెండు లక్షల హెక్టార్లలో వరిసాగు చేశారు. నెల్లూరు మసూర, బుడ్డలు, బిపిటి 5204 రకాలను ఎక్కువగా సాగు చేశారు రైతులు. సాధారణ రకమైన బుడ్డలు కాకుండా, మిగిలినవి 'ఏ' గ్రేడ్ క్రిందకు వస్తాయి. ఏ గ్రేడ్ రకానికి క్వింటాల్‌కు 1280 రూపాయలు, బి గ్రేడ్ రకం క్వింటాల్‌కు 1250 రూపాయలుగా ప్రభుత్వం ధర ప్రకటించింది. గత ఏడాది ధాన్యం కొనుగోలు కేంద్రాల ద్వారా లక్ష మెట్రిక్ టన్నుల ధాన్యాన్ని సేకరించాలని లక్ష్యంగా పెట్టుకొని అధికంగా మరో యాభైవేల మెట్రిక్ టన్నులను సేకరించగలిగారు. ఈ ఏడాది రెండు లక్షల మెట్రిక్ టన్నుల ధాన్యాన్ని కొనుగోలు చేయాలని అధికారులు లక్ష్యంగా పెట్టుకొన్నారు. అందుకుగాను 135 ధాన్యం కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేశారు. వాతావరణ పరిస్థితుల దృష్ట్యా తేమను, తాలు తరకల క్రింద, గోతాలు క్రింద అదనంగా రెండు కిలోలు సేకరించారన్న విమర్శలు వచ్చాయి. ప్రభుత్వం నిర్దేశించిన ప్రమాణాల ప్రకారం తేమ 17 శాతం, దుమ్ము ధూళి, మట్టి, రాళ్లు ఒక్క శాతం, రంగుమారిన, దెబ్బతిన్న బియ్యం 4 శాతం, తక్కువ రకం ధాన్యం 7 శాతం వరకు అనుమతించవచ్చు. వీటిని సాకుగా చూపి గత ఏడాది ధాన్యం ధరలను తగ్గించి కొనుగోలు చేశారని, ఈ సంవత్సరం అలానే జరిగితే తీవ్రంగా నష్టపోతామని రైతులు వాపోతున్నారు. మద్దతు ధర విషయంలో ప్రభుత్వం ఈ సారైనా రైతులకు న్యాయం జరిగేలా చేస్తుందేమోనన్న ఆశ పెట్టుకొన్నారు రైతాంగం.

**వరి కోతలు మొదలయ్యాయి**

● గందరగోళంగా

## రెడ్‌క్రాస్ సర్వసభ్య సమావేశం!

ఇటీవల జరిగిన రెడ్‌క్రాస్ సర్వసభ్య సమావేశంలో గందరగోళ పరిస్థితులు నెలకొన్నాయి. జిల్లా జాయింట్ కలెక్టర్ ఆధ్వర్యంలో మద్రాస్ బస్టాండ్ సమీపంలో వున్న రెడ్‌క్రాస్ సమావేశ మందిరంలో ఈ సమావేశం జరిగింది. రెడ్‌క్రాస్‌కు నూతన కార్యవర్గాన్ని ఎన్నుకోవాలన్న ఉద్దేశంతో ఏర్పాటుచేసిన ఈ సమావేశం విమర్శలు, ఆరోపణలకు వేదికగా మారింది. గత పాలకవర్గం హయాంలో జరిగిన అవకతవకలపై సమగ్ర విచారణ జరిపించాలని సభ్యులు పట్టుబట్టారు. అనేక సంవత్సరాల నుంచి కొందరు వ్యక్తులే కీలక పదవుల్లో వుంటున్నారని, ఇతరులకు ఎందుకు అవకాశం కల్పించడం లేదని ప్రశ్నించారు. స్వచ్ఛందంగా రక్తం దానం చేసే వారు అనేక మంది వున్నారని, పాలకవర్గంలో వున్న కొందరు వ్యక్తుల వైఖరి కారణంగా వారు దూరమై పోతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. జిల్లా జాయింట్ కలెక్టర్ సభ్యులు లేవనెత్తిన ప్రశ్నలకు సరైన సమాధానం చెప్పలేక పోయారు. కొందరు అధికారులతో అడహాక్ కమిటీని ఏర్పాటుచేసి కార్యక్రమాన్ని ముగించారు జెసి.

### బాధితురాలు ఆందోళన

రెడ్‌క్రాస్ రక్తనిధి నుంచి రక్తంకొని ఎక్కించుకొని హెచ్ఐవి బారినపడిన వెంకటేశ్వరపురంకు చెందిన మహిళ సమావేశం వద్దకు వచ్చి తనకు న్యాయం చేయాలని అధికారులను వేడుకొంది. బాధితురాలికి మద్దతుగా పౌరహక్కుల సంఘం జిల్లా కార్యదర్శి ఎల్లంకి వెంకటేశ్వర్లు, సుబ్బయ్య, సిపిఐ కార్యదర్శి రామరాజు పలువురు నేతలు తరలి వచ్చారు. రెడ్‌క్రాస్ ప్రతినిధుల నిర్లక్ష్యం కారణంగా హెచ్ఐవి రక్తం సరఫరా చేశారని వారు ఆరోపించారు. బాధితురాలికి ఇంటి నివేశన స్థలం, రెండు లక్షల రూపాయల ఆర్థిక సహాయం కల్పిస్తామని కలెక్టర్ ఇచ్చిన హామీలను ఇప్పటివరకు అమలు చేయలేదన్నారు.




## నెల్లూరు ట్రెజరీలో లంచావతారం!

### అవినీతి చేపలను పట్టిన ఎసిబి

ట్రెజరీ సిబ్బంది లంచాల భాగోతం మరోసారి బట్టబయలైంది. వైద్య ఆరోగ్య శాఖకు సంబంధించి వైద్య పరికరాలకు బిల్లులు మంజూరు చేసేందుకు లంచం తీసుకొంటూ ట్రెజరీ అధికారులు రెడ్ హ్యాండెడ్‌గా ఎసిబి అధికారులకు దొరికి పోయారు. ఎటిఓ మోహన్‌రావు, వెంకటశేషయ్య, డ్రైవర్‌లు 65వేల రూపాయలు లంచంగా అందుకొంటుండగా అధికారులు వల పన్ని పట్టుకొన్నారు. ట్రెజరీ కార్యాలయమే అవినీతి జమానాగా మారిందని పలువురు పలుమార్లు ఆరోపణలు చేశారు. ప్రతి ఉద్యోగి దగ్గర ఇంత కమీషన్ అని నిలబెట్టి వసూలు చేస్తుంటారు. ఆ శాఖ ఉన్నతాధికారిగా వ్యవహరించిన భ్రమరాంబ పోలీసు సిబ్బందికి రావాల్సిన బిల్లులు మంజూరుకు ఏసి, వాహనానికి డీజిల్ అడిగి, దీనిపై ఎస్పీ ఆగ్రహానికి గురై బదలీ అయిపోయింది. ఈ పరిస్థితుల్లో తాజాగా ఇక్కడి సిబ్బంది ఎసిబికి దొరికి పోవడంతో పలువురు ఉద్యోగులు లంచావతారులు కొందరైనా దొరికినందుకు సంతోషం వ్యక్తం చేస్తున్నారు. వీరిలో మోహన్‌రావు అనే వ్యక్తి కారుణ్య నియామకాల ద్వారా ఉద్యోగాలు పొందిన మహిళలను లోబరుచుకోవడంతోపాటు వారిని పలు రకాలుగా వేధింపులకు గురి చేస్తుంటాడనే ఆరోపణలున్నాయి. సూళ్లూరుపేట తదితర ప్రాంతాలలో పనిచేసినప్పటి నుంచి ఇతని వ్యవహారశైలి వివాదాస్పదమేనట. చివరకు ఉద్యోగులకు సంబంధించి పదోన్నతుల కోసం జరిగే పరీక్షలకు ఆయా సిబ్బందిని బెదిరించి మరీ తనకు అనుకూలురైన వారికి సులువుగా సమాధానాలు వ్రాసేలా చేస్తుంటాడట. గతంలో డికె కళాశాలలో ఈ పరీక్షలు జరిగినపుడు అక్కడ విధులు నిర్వహించే సిబ్బందిని మా అవసరం మీకు ఎంతో వుంది, మావాళ్లు పరీక్షలు వ్రాస్తున్నారు అని కొందరు మహిళల పేర్లు చెప్పి పని చేయించుకొన్నట్లు సమాచారం. నిత్యం మందు, మగువ, లంచాల మత్తులో మునిగి తేలుతుండే ఇలాంటి వారిపై కఠిన చర్యలు చేపట్టాలని పలువురు కోరుకొంటున్నారు.

## పంట నష్టంపై పూర్తికాని సర్వే!

### అంతా అయోమయం

జిల్లాలో గత 15 రోజుల క్రితం కురిసిన అకాల వర్షం కారణంగా వివిధ రకాల వ్యవసాయ పంటలు దెబ్బతిన్నాయి. కంది, పెసర, వేరుశనగ పంటలతోపాటు వరి పంట కూడా కొంతమేర దెబ్బతిన్నది. జిల్లావ్యాప్తంగా దెబ్బతిన్న పంటలను సర్వే చేయించాలని జిల్లా కలెక్టర్ అకాల వర్షం కురిసిన మరుసటి రోజే ప్రకటించడం జరిగింది. ఇందుకు వ్యవసాయశాఖ ఆధ్వర్యంలో అధికారులు గ్రామాల్లో సర్వే నిర్వహించి దెబ్బతిన్న పంటల వివరాలను నమోదు చేయాల్సి వుంటుంది. అయితే జిల్లా కలెక్టర్ సర్వే చేయాలని ప్రకటించి దాదాపు రెండు వారాలు గడుస్తున్నా కూడా పంట నష్టాలపై సర్వే పూర్తి చేయలేక పోతున్నారు. రాష్ట్ర ప్రభుత్వం కూడా అకాలవర్షం కారణంగా దెబ్బతిన్న పంటల వివరాలను సేకరించి నివేదిక పంపితే రైతులను నష్టపరిహారం అందిస్తామని ప్రకటించింది. నష్టపోయిన రైతులు పరిహారం కోసం ఎదురు చూస్తున్నారు. జిల్లా వ్యవసాయశాఖ సంయుక్త సంచాలకులు, మండల వ్యవసాయ శాఖాధికారులు సర్వే చేస్తారని చెప్పారు. ఎక్కువగా పంట నష్టం జరిగిన ప్రాంతాల్లో ప్రత్యేక బృందాలను ఏర్పాటు చేసినట్లు చెబుతున్నారు. సర్వే ఎప్పటికి పూర్తి చేస్తారో, పరిహారం ఎప్పుడందుతుందో వేచి చూడాలి.

● అసాంఘిక కార్యకలాపాల అడ్డాగా

## సాంఘిక సంక్షేమ కార్యాలయం!

### మరీ ఇంత బరితెగింపా?

పట్టించుకునే వారు లేకపోవడంతో ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు సాంఘిక సంక్షేమ శాఖలో ఉద్యోగులు. నగరంలో కొండాయపాళెం గేటు సమీపంలో వున్న జిల్లా సాంఘిక సంక్షేమ శాఖ ఉప సంచాలకుల కార్యాలయం రాత్రి సమయంలో అసాంఘిక కార్యక్రమాలకు వేదికగా మారుతుంది. ఈ కార్యాలయంలో విధులు నిర్వహిస్తున్న కొందరు వ్యక్తులు రాత్రి పొద్దుపోయాక మద్యం సేవిస్తున్నారన్న ఆరోపణలు వున్నాయి. ప్రభుత్వ నిబంధనల ప్రకారం సాయంత్రం 6 గంటలకు కార్యాలయాలను మూసివేయాలి. ఉదయం 10.30 గంటలకు కార్యాలయానికి హాజరు కావాల్సిన ఉద్యోగులు 11 గంటల పైనే హాజరవుతున్నారు. ఈ కార్యాలయంలో ఉప సంచాలకులు వున్నప్పటికీ కిందిస్థాయి ఉద్యోగుల పనితీరుపై ఏనాడూ దృష్టి సారించిన దాఖలాలు లేవు. ఈ కార్యాలయంలో స్కాలర్‌షిప్పు విభాగంలో విధులు నిర్వహిస్తున్న ఓ ఉద్యోగి రాత్రి సమయంలో తన గదిలోనే మద్యం సేవించి, బస చేస్తున్నట్లు తెలిసింది. ఇతనికి ఇతర సదుపాయాలు కల్పించేందుకు ఒక అటెండరును కూడా ఉపయోగించుకొంటున్నట్లు ప్రచారం వుంది. సంవత్సరాల తరబడి ఈ కార్యాలయంలో తిష్టవేసిన ఉద్యోగులు చక్రం తిప్పుతున్నారు. ఇక్కడ వీరు చెప్పిన విధంగానే పనులు జరగాలి. ఇప్పటికే ఈ కార్యాలయంపై అనేక అవినీతి ఆరోపణలు వెల్లువెత్తినా, ఆ శాఖ ఉన్నతాధికారి స్పందించకపోగా, సాంఘిక సంక్షేమ శాఖ కార్యాలయంపైనే పత్రికల్లో వార్తలు రాస్తారని, మిగిలిన శాఖల గురించి ఎందుకు రాయరని మీడియాపై చిందులు వేస్తుంటారు. ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ స్పందించి ఈ శాఖ కార్యాలయంలో రాత్రివేళలో జరుగుతున్న అసాంఘిక కార్యకలాపాలపై విచారణ చేస్తే మంచిది.

## మార్చి 1 నుంచి బయోమెట్రిక్ సర్వే!

నెల్లూరు నగరంలో మార్చి 1 నుంచి బయోమెట్రిక్ సర్వే నిర్వహించనున్నారు. మునిసిపల్ కార్పొరేషన్, మెప్మా సంయుక్తంగా ఈ సర్వే కార్యక్రమం నిర్వహిస్తాయి. ఇందుకు సంబంధించి మునిసిపల్ కార్పొరేషన్ కమిషనర్ ఆంజనేయులు తన కార్యాలయంలో సిబ్బందితో సమీక్షా సమావేశం నిర్వహించి సర్వేపై అవగాహన కల్పించడం జరిగింది. ఇప్పటికే గ్రామీణ ప్రాంతాల్లో సామాజిక, ఆర్థిక, కులగణన సర్వే కార్యక్రమం 80 శాతం వరకు పూర్తి చేశారు. కేవలం నెల్లూరు, కావలి, గూడూరు, వెంకటగిరి ప్రాంతాల్లో మునిసిపల్ కార్పొరేషన్, మెప్మా ఆధ్వర్యంలో ఇప్పుడు చేపట్టనున్నారు. సర్వేకు సంబంధించి ఎన్యుమరేటర్ల నియామకం పూర్తి చేశారు. గ్రామీణ ప్రాంతాల్లో మాదిరిగానే పట్టణ ప్రాంతాల్లో కూడా ఒకేసారి ప్రారంభం కావాల్సి ఉన్నప్పటికీ వివిధ కారణాల వల్ల వాయిదా పడినట్లు అధికారులు చెబుతున్నారు. ఈ సర్వే కార్యక్రమం త్వరితగతిన పూర్తిచేసి ప్రభుత్వానికి పంపనున్నారు. భవిష్యత్తులో బయోమెట్రిక్ సర్వే ఆధారంగానే సంక్షేమ పథకాలు మంజూరు, నిధుల కేటాయింపులు జరుగుతాయి.



**ఇండియన్ మెడికల్ అసోసియేషన్ జాతీయ నాయకుడు డాక్టర్ జి.అశోక్ కుమార్తె డాక్టర్ లక్ష్మీ సుష్మిత, డాక్టర్ చంద్రశేఖర్‌రెడ్డిల వివాహం ఫిబ్రవరి 14వ తేది నెల్లూరులోని ఎం.ఎస్.ఆర్ కళ్యాణ మండపంలో జరిగింది.**

## జగన్

మొదటి పేజీ కొరవ

జనంలో అభిమానం వెల్లువెత్తుతుండడం, రేపటి ఎన్నికలలో గెలుపు ఖాయం అన్న ధైర్యం ఏర్పడడంతో ప్రతి నియోజకవర్గంలో టిక్కెట్ కోసం పోటీ విపరీతంగా వస్తున్నది. నాలుగు రూపాయలు డబ్బున్న ప్రతిఒక్కడూ టిక్కెట్ కోసం ప్రాకులాడుతున్నాడు. వారి పోటీ అంతః కలహాలకు దారి తీస్తున్నది. అప్పటికే జగన్ ముప్పాతిక భాగం నియోజకవర్గాలలో చాలా ముందుగానే అభ్యర్థులను గుర్తించాడు. అయినా సరే డబ్బున్న మారాజులు తమకు టిక్కెట్ ఇచ్చి తీరాల్సిందే అని ఒత్తిడి చేస్తున్నారు. నియోజకవర్గ స్థాయిలో ఆధిక్యత ప్రదర్శించడం కోసం గొడవలకు దిగుతున్నారు. దానితో పార్టీ చిందర వందరగా తయారౌతున్నది. ఈ కలహాలకు స్వస్తి పలకకుంటే ప్రత్యర్థి పార్టీతో తేడా తక్కువగా వున్న చోట్ల చేజేతులా ఓటమి ఎదుర్కోవలసి వస్తుందని భయపడుతున్నాడు జగన్. అసలే తెలంగాణాలో పరిస్థితి అస్తుబిస్తుగా వున్నప్పుడు, ఆంధ్ర రాయలసీమ ప్రాంతాలలో ఒక్క సీటు విషయంలో కూడా అజాగ్రత్తగా వుండడం ఆత్మహత్య సదృశ్యమౌతుందని ఆయన భయం.



నెల్లూరు సిటీ నియోజకవర్గంలో వైకాపా నాయకుడు డాక్టర్ పోలుబోయిన అనిల్‌కుమార్ యాదవ్ తాను చేపట్టిన ప్రజాదీవెన యాత్రలో భాగంగా 44వ డివిజన్ ప్రజల కష్టసుఖాలు అడిగి తెలుసుకొంటున్న దృశ్యం.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

నించారు. మతాల దృష్టిలో స్త్రీ స్థానం అనే అంశంపై టౌన్‌హాల్లో జరిగిన చర్చా వేదికలో ఆయన పాల్గొని ప్రసంగించారు. స్త్రీలపై లైంగిక దాడులకు సంబంధించి మూలాలు అన్ని మతాలు, వాటి మత గ్రంథాలలోనే వున్నాయని విమర్శించారు. పురుషాధిక్యతకు వ్యతిరేకంగా స్త్రీలు ఉద్యమించాలన్నారు.

### బ్రాహ్మణ వధూవరుల పరిచయ వేదిక

10వ రాష్ట్రస్థాయి బ్రాహ్మణ వధూవరుల పరిచయ వేదికను ఏప్రెల్ 21వ తేదీన కస్తూరిబా కళాక్షేత్రంలో నిర్వహిస్తున్నట్లు వేదిక ఆర్గనైజర్ బి.శివనారాయణ తెలిపారు. ఈ కార్యక్రమంలో పాల్గొనదలచినవారు ఏప్రెల్ 10వ తేదీలోగా తమ పేర్లను నమోదు చేసుకోవాలన్నారు. పూర్తి వివరాలకు కొండాయపాళెం రామకృష్ణనగర్‌లో గల ఉచిత వివాహ సమాచార కేంద్రంలోగానీ, 94418 95595, 0861-2337501 అనే నెంబర్లలోగానీ సంప్రదించవచ్చన్నారు. ఈ అవకాశాన్ని బ్రాహ్మణులు సద్వినియోగం చేసుకోవాలని ఆయన కోరారు.



### సమైక్యాంధ్ర జెఏసి వంటావార్పు

సమైక్యాంధ్రను కోరుతూ సమైక్యాంధ్ర జెఏసి నగరంలోని జాతీయ రహదారిని దిగ్బంధించి బైఠాయించారు. ఫిబ్రవరి 24న జరిగిన ఈ కార్యక్రమంలో భాగంగా అక్కడే వంటావార్పు కార్యక్రమం నిర్వహించి సహపంక్తి భోజనం చేశారు. ఈ సందర్భంగా నగర శాసనసభ్యుడు ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి మాట్లాడుతూ మంత్రి పదవుల కోసమే కెసిఆర్, ఆయన కుటుంబ సభ్యులు, కోదండరామ్ లాంటి వాళ్లు తెలంగాణ ఉద్యమం చేస్తున్నారని విమర్శించారు.

### డిఇఓ కారణంగానే జీతాలు అందలేదు!

జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం కారణంగానే డిఎస్సీ 2012లో ఉపాధ్యాయులుగా నియమించబడిన వారికి జీతాలు నిలిచిపోయాయని ఎపిటిఎఫ్ ఆరోపించింది. దీనిపై జిల్లా కలెక్టరేట్ వద్ద ధర్నా నిర్వహించారు. ఈ సందర్భంగా ఎపిటిఎఫ్ నేత వెంకటేశ్వర్‌రావు మాట్లాడుతూ నియామక పత్రాలు ఇచ్చిన డిఇఓ టైమ్ స్కేల్ నమోదు చేయక పోవడంతో కొత్త టీచర్లకు జీతాలు అందలేదన్నారు.

### పునరావాసం కోసం బాధితుల ఆందోళన

పరిశ్రమల ఏర్పాటు కారణంగా జీవనోపాధి కోల్పోయిన వారికి ఉపాధి కల్పించడం ప్రభుత్వ బాధ్యత. భూములు, గ్రామాలను వదలిన వారికి పునరావాసం, గ్రామ పునర్నిర్మాణం కోసం కృషి చేయాల్సిన అధికార యంత్రాంగం చేతులెత్తేసింది. దీంతో బాధితులు రోడ్డుపైకి వచ్చి ఆందోళన చేపట్టాల్సిన పరిస్థితి ఏర్పడింది. ముత్తుకూరు మండలం నేలటూరు పట్టపుపాళెంకు చెందిన మత్స్యకారులు ఆందోళన బాటపట్టారు. కృష్ణపట్నం పోర్టు, ఎపి జెన్‌కో పవర్ ప్లాంటు కారణంగా సముద్రంలోకి చేపల వేటకు వెళ్లే అవకాశం మత్స్యకారులు కోల్పోయారు. ఉన్న కొద్దిపాటి భూముల్ని కూడా పరిశ్రమలకు కేటాయించడంతో కూలి పనులు కూడా లేకుండా పోయాయి. పరిశ్రమలు ఏర్పాటు చేసే సమయంలో గ్రామాల్ని ఖాళీ చేస్తే వేరే ప్రాంతంలో ఇళ్ల స్థలాలు కేటాయించి, పక్కా ఇళ్లు నిర్మించి ఇవ్వడంతోపాటు స్థానికులకు ఉపాధి అవకాశాలు కల్పిస్తామని అధికారులు హామీ ఇచ్చారు. అయితే ఇచ్చిన హామీలను అధికారులు, ప్రజాప్రతినిధులు నిలబెట్టుకోలేక పోయారు. దీంతో మత్స్యకారులు నెల్లూరుకు తరలివచ్చి కలెక్టర్‌ను కలిసి తమ సమస్యలను విన్నవించుకున్నారు. చేపల వేటకు వెళ్లలేక పోవడంతో దుర్భర జీవనం సాగిస్తున్నామని ఆవేదన వ్యక్తం చేశారు. సానుకూలంగా స్పందించాల్సిన జిల్లా కలెక్టర్ పునరావాసం, నష్టపరిహారం చెల్లించడం కుదరదని తేల్చి చెప్పారు. కలెక్టర్ ప్రకటనతో అవాక్కయిన మత్స్యకారులు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. న్యాయం కోసం ఇక్కడకు వస్తే అన్యాయంగా మాట్లాడడం పట్ల అసహనం వ్యక్తం చేశారు. తమకు అన్యాయం చేసే పరిశ్రమలను ఎలా నిర్వహిస్తారో గ్రామంలోనే తేల్చుకుంటామని మండిపడ్డారు. మత్స్యకారుల ఆవేదనను అర్థం చేసుకుని న్యాయబద్ధంగా వారికి పరిహారం అందించాల్సిన అవసరం వుంది. లేకుంటే లేనిపోని సమస్యలు ఏర్పడి పరిశ్రమల నిర్వహణకు ఆటంకం కలిగే ప్రమాదం వుందని రాజకీయపక్షం నేతలు అంటున్నారు.



## జనవాణి

2వ పేజీ కొరవ

విద్యార్థులు, అధ్యాపకులు, అందరు నెత్తిన పెట్టుకునేవారు. పాతకాలంలో నెల్లూరు అంటే, నెల్లూరు పిల్లలంటే ఫుట్‌బాల్ ఆడుతారనే పేరు. ఈ హ్యాండ్ బాల్ పోటీలు ఇంత పెద్దఎత్తున జరిపిన, నిర్వహించిన, ఏ మాత్రం లోటుపాట్లు లేకుండా జరపడంతోపాటు ఆర్థిక సహాయ మందించిన మంత్రి రామనారాయణ రెడ్డిగారికి ఇతర నిర్వాహకులకు నా హృదయ పూర్వక అభినందనలు.

*తూపిలి వనమాలి* నెల్లూరు

### లోక్‌సత్తాలో సత్తా తగ్గుతుంది!

సుపరిపాలన, సురాజ్యస్థాపన, విధులు, నిధులు, నీతినిజాయితీ, పారదర్శకత, ధార్మికత, ప్రజలకు జవాబుదారీతనం గూర్చి చెప్పిన వ్యక్తి లోక్‌సత్తా స్థాపకుడు డాక్టర్ జయప్రకాష్ నారాయణ. ఎమ్మెల్యేగా ఎన్నికయ్యాక ఆయన ఆలోచనలకు, ఆచరణకు పొంతన కుదరడం లేదు. వచ్చే ఎన్నికలకు ఆ పార్టీ కనుమరగయ్యేలా ఉంది.

*తనిశెట్టి వెంకటరమణయ్య* మాచర్లవారిపాళెం

## పదరంగం -57

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | 4 | | 5 | 6 |
| | | 7 | | | | | | 8 | |
| | 9 | | | | | 10 | 11 | | |
| 12 | | 13 | | 14 | 15 | | 16 | | |
| 17 | | | | | 18 | 19 | | | 20 |
| | | 21 | 22 | | 23 | | | 24 | |
| 25 | 26 | | 27 | | | | 28 | | |
| | 29 | 30 | | | 31 | 32 | | 33 | |
| 34 | | | | 35 | | 36 | 37 | | |
| | | 38 | | | | 39 | | | |

**అడ్డం**

1. వ్యాపారం, వాణిజ్యం (3)
4. ఎద్దు భుజశిరము (4)
7. మేలుకొరేవాడు (5)
8. వీలునామా, ధనుస్సు (2)
10. జొన్న మొక్కజొన్నల వెన్ను (2)
12. ఓరిమి, ఓర్పు (3)
14. అటునుంచి అనిరుద్ధుని భార్య తెల్లవారుజాము (2)
16. మాణిక్యం తోటిది, విలువైన రాయి (2)
17. కాపి (3)
18. ఘోరం (3)
21. అటునుంచి గూఢచారి (2)
23. కొండ గృహం అటునుంచి (2)
24. తోక తెగిన పరుగు (2)
25. అటునుంచి అంగుళీయం (2)
27. 8 గ్రామములు (3)
28. అల్మయిరా (3)
29. విజ్ఞాపన, విన్నపము (3)
31. అటునుంచి చిట్టిబాబు గారి వాయిద్యం (2)
33. లోపం, వాగుతో పాటిది (2)
34. వర్షాలు (3)
36. తోము (2)
38. రోజా పువ్వు (3)
39. ప్రథమా విభక్తి ప్రత్యయాలు (4)

**నిలువు**

1. ప్రపంచం (2)
2. క్రింద నుంచి వరుస, వర్గము (2)
3. కోరిక, యండమూరి, చిరంజీవిల సినిమా (4)
4. ఎలుక (3)
5. సూర్యుడు (2)
6. కంటకం (2)
9. సెలక్షన్ (3)
11. కాంతిరేఖ (3)
12. అక్షరాభ్యాసం వీటితోనే మొదలు. ఒక సినిమా పేరు (4)
13. ఎలుకగారి లోగిలి (3)
15. ఎగ్గాంపుల్ (5)
19. క్రిందనుంచి అధ్యాపకుడు (2)
20. వ్యవసాయ పనుల ప్రారంభం (4)
22. ఎండాకాలం (3)
24. యవ్వనం (3)
26. నవయుగ వైతాళికుడైన విశ్వదాభిరాముడు (3)
30. సున్నిపిండి స్నానం (3)
32. వీరత్వం కలవాడు (3)
34. వాచికం (2)
35. శరీర త్యాగానికి సిద్ధపడ్డ దాన చక్రవర్తి (2)
37. క్రిందనుంచి చుంబనం (2)

**సమాధానాలు**

## పదరంగం -56

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1అ | ను | 2జు | డు | | | 3బిం | 4దు | 5సే | ద్యం |
| రి | | ల్మా | | 6తీ | 7రం | | 8కా | రు | |
| 9క | 10మి | నా | 11అ | | 12త | రు | ణం | | 13ము |
| 14ట్ట | త | | 15తి | 16మి | రం | | | 17మే | ను |
| 18డం | ము | 19భ | | 20ధు | ని | | 21తె | లు | పు |
| | | జం | | నం | | 22వ | ర | కొ | |
| 23ధ | 24రి | త్రి | | | 25పు | | 26మ | లు | పు |
| 27రా | గు | లు | | 28కం | | 29ఎ | రు | పు | |
| వ | | | 30ట్రీ | | 31వె | లు | గు | | 32వ |
| 33త్తు | మ్మ | గ | | 34చి | ల | క | | 35వ్య | ధ |

● రెండు మంచి పుస్తకాలు

# వ్యాసవల్లరి, నేటి వేమన నానీలు!

తెలుగు సాహిత్య రంగంలో వ్యాస ప్రాధాన్యం పూర్తిగా తగ్గిపోయి ఆ ప్రక్రియలో పుస్తకాలు వెలువడడం దాదాపు ఆగిపోయిన సంక్షోభ కాలంలో పి.వి.రమణారెడ్డి వివిధ అంశాల మీద రాసిన పదిహేడు వ్యాసాల సంకలనం వ్యాసవల్లరి వెలువడడం సంతోషకరమైన విషయం. 'జమీన్‌రైతు' తదితర పత్రికల్లో వెలువడిన ఈ వ్యాసాలు 1987లోనే సంకలనంగా వెలువడ్డాయి. దానికి ద్వితీయ ముద్రణ ఇటీవలే వెలువరించడం విశేషం. ఇందులో రచయితను ఆకర్షించిన వ్యక్తులపై, అంశాలపై విశ్లేషణాత్మక వ్యాసాలున్నాయి. ముఖ్యంగా రవీంద్రుడు, వేమన, మదర్ థెరిస్సా, ఉమర్‌ఖయ్యామ్, తిరువళ్లువర్, నారాయణగురుల గురించి రాసిన వ్యాసాల్లో వారి వ్యక్తిత్వాన్ని భిన్న కోణాల నుంచి పాఠకులకు పరిచయం చేశారు. నిజానికి వీటిని వ్రాసేందుకు రచయిత ఎంతో కృషి చేసి వుంటాడనే విషయం వ్యాసాలను చదువుతూ వుంటేనే అర్థం అవుతుంది. ముఖ్యంగా కన్నడ సామాజిక సంస్కరణ వేత్త సర్వజ్ఞుడిని పరిచయం చేస్తూ రాసిన వ్యాసం అపురూపం. తెలుగు సాహిత్యంలోనే సర్వజ్ఞుడిని గురించి సమాచారం దాదాపు శూన్యం. అలాగే కొండవీటి రాజులపై వ్రాసిన వ్యాసం కూడా ఇదే కోవకు చెందింది. వరకట్న దురాచారంపై రాసిన వ్యాసం వరకట్నంపై కేంద్రం వెలువరించిన శాసనాలను పాఠకులు క్లుప్తంగానైనా చాలా సరళంగా అర్థం చేయిస్తుంది. ఈ వ్యాసాలు ఏవీ కూడా పేజీలకు పేజీలు కొనసాగవు. అసలు విషయాన్ని వదలి పక్కదారులు పట్టవు. చాలా తక్కువ పేజీలలో రచయిత చెప్పదలుచుకున్న విషయ సారాన్ని సూటిగా వ్యక్తీకరించాడు. ఫలితంగా పాఠకులు సునాయాసంగా వ్యాసాలను చదివే వీలవుతుంది. ముఖ్యంగా ఈ వ్యాసాలలో శంకరాభరణంపై రాసిన విశ్లేషాత్మక సమీక్షావ్యాసం పాఠకుల్ని ఆకర్షిస్తుంది. శంకరాభరణంపై భారత దేశంలో కె.బాలగోపాల్ వ్యాసం తర్వాత అదే స్థాయిలో ఆధ్యాత్మిక విలువల పరంగా సినిమాను విశ్లేషించడం వ్యాసానికి నిండుదనం చేకూర్చింది. వ్యాస రచయితలు అందరూ జర్నలిస్టులుగా, న్యూస్ రిపోర్టర్లుగా మారిపోయిన ఈ రోజుల్లో రమణారెడ్డి లాంటి వారు వ్యాసాలు రాయాల్సిన సామాజిక అవసరం ఎంతో వుంది. ఒకసారి కాదు అప్పుడప్పుడూ చదువుకోదగ్గ వ్యాస సంపుటి వ్యాస వల్లరి.

**పుస్తకసమీక్ష**

**వ్యాసవల్లరి**

రచయిత : **పి.వి.రమణారెడ్డి**

సమీక్షకుడు : **డాక్టర్ ధనిశెట్టి లెనిన్**

వెల: 30/– పేజీలు: 80

ప్రతులకు: **పి.వి.రమణారెడ్డి**, అడ్వకేటు.

16/1175, కస్తూరిదేవినగర్

నెల్లూరు – 524001

## నేటి వేమన నానీలు

సమకాలీన వ్యవస్థలో వేమన జీవించి వుంటే నేటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో శరవేగంగా పతనమవుతున్న సామాజిక విలువలను తూర్పారబడుతూ ఆట వెలదుల్లో కాక నానీల రూపంలో ఎలా రాస్తాడో అనే వూహకు అక్షర రూపం రాచపాలెం రఘు రాసిన 'నేటి వేమన నానీలు'. ఇందులోని నూటొక్క నానీలు నేటి సమాజంలో ప్రతిఫలిస్తున్న నూటొక్క అవలక్షణాలకూ అనాచారాలకూ, మూఢ విశ్వాసాలకూ ప్రతీకలు. వాటిని ఎత్తి చూపించడంలోనూ, ఎండ గట్టడంలోనూ అల్పపదాలతో అనంతార్థం చూపించేలా నానీలను రాశాడు రఘు. నిజానికి ఇందులో పాఠకుల్ని చదవగానే క్షణాల్లో ఆలోచనలకు గురిచేసే నానీలకు కొదవలేదు. చక్కటి భావనిర్దిష్టతతో అతి త్వరగా పాఠకుల్లో సస్పదనలనూ, సంవేదనలను రగిలించగల శక్తి రఘు నేటి వేమన నానీల్లో వుంది. కవిత్వం కవుల భావుక అంత రంగంలో నుంచి వెలువడ్డప్పటికీ అది సమకాలీన సమాజ సమాజపు ప్రజల హృదయాల్లో, మనస్సుల్లో గాఢమైన ముద్రవేసి మార్పు దిశగా వారిని ప్రోత్సహించకపోయినా పుస్తకం కొన్నందుకు కనీసం వారికైనా రసానుభూతికి లోను చేయకపోతే ఆ రచన వృథా. అయితే రఘు నానీలు మొద్దు నిద్రలో వున్న మస్తిష్కాన్ని సైతం తట్టి లేపుతాయి. అన్ని రంగాలలో సమాజం తాలుకు పతనావస్థను ఎత్తి చూపుతాయి. వ్యంగ్యంగా అధిక్షేపిస్తాయి. పిల్లవాడినీ, పండు ముసలినీ ఈ నానీలు సమానంగా అలరిస్తాయి. ఆదే శింపజేస్తాయి. ఆలోచన పరుస్తాయి. అలాగే ఈ నానీలను రాయడంలో రఘు ఎక్కడా రాజీ పడలేదు. ప్రతి నానీలో వస్తువు వ్యవస్థను దునుమాడుతున్న పచ్చి నిజమే తప్ప ఎక్కడా గత కాలపు వైభవాలు స్వకపోలకల్పిత అనవసర భావుకత్వమూ ఉండదు. ఇందుకు ప్రధాన కారణం కవి ఆలోచనకూ ఆచరణకూ మధ్య తేడాలు వుండకపోవడమే. ఈ నానీల్లో కవి వ్యథ పడ్డట్టు... దాన్ని చిన్న పదాలలోకి ప్రసారం చేసి అక్షరాయుధంగా మార్చి వర్తమాన సాంఘిక వ్యవస్థపై సంధిస్తాడు. సామాన్య పాఠకుడిలో సంవేదనలు రేకెత్తిస్తాడు. రఘు నానీలు మరుగుజ్జు రూపంలోని మహాబలాడ్యులు. అయితే పుస్తకంలో అవసరానికి మించిన ముందు మాటలు తగ్గించి వుండాల్సింది. నానీలతోపాటు ప్రచురించిన అనేక రంగాలలోని సంస్కర్తలూ, గొప్పవాళ్ల ఫోటోలు ఈ పుస్తకానికి అదనపు ఆకర్షణ. ఆయా వ్యక్తుల పేర్లు ఫోటోల కింద వేసి వుంటే బావుండేది. రఘు నానీల్లాగే విజయ్ రూపొందించిన ముఖ చిత్రం భావస్ఫోరకంగా వుంది. సమాజం పట్ల బాధ్యతతో, మనిషి మీద ప్రేమతో, ప్రపంచాన్ని ఆశాజనకంగా తీర్చిదిద్దాలనే సదుద్దేశంతో కవిత్వం రాస్తున్న రఘు అభినందనీయుడు.

**పుస్తకసమీక్ష**

**నేటి వేమన నానీలు**

రచయిత : **రాచపాలెం రఘు**

సమీక్షకుడు : **డాక్టర్ ధనిశెట్టి లెనిన్**

వెల: 50/– పేజీలు: 93

**ప్రతులకు**

**విశాలాంధ్ర పబ్లికేషన్స్ అని బ్రాంచీలు**

**నవయుగ పబ్లికేషన్స్ అని బ్రాంచీలు**



రైతు లోకం

# వరిలో దోమపోటు – నివారణ!

ప్రస్తుతం వరి పంట మన జిల్లాలో దుబ్బు చేసే దశ నుంచి కంకి పాలు పోసుకొనే దశ వరకు ఎక్కువ భాగం వున్నది. ప్రస్తుత వాతావరణ పరిస్థితులలో దోమపోటు అక్కడక్కడా ఆశించి వుంది.

**దోమపోటు (సుడిదోమ)**

ఈ దోమ వరి మొక్కల మొదళ్ల దగ్గర గుంపులుగా చేరి రసం పీల్చుట వల్ల పైరు లేత పసుపు రంగులోకి మార్పు చెంది క్రమంగా సుడులు, సుడులుగా ఎండిపోతుంది. దీని నివారణకు క్రింది పద్ధతులు పాటించాలి.

అప్పుడప్పుడు పొలాన్ని ఆరబెట్టి మరలా పలుచగా నీరు పెట్టాలి. ఆఖరి దఫా వేసే నత్రజని ఎరువును సిఫారసు మేరకే వేయాలి. ఆఖరి దఫా నత్రజనితో పాటు పొటాష్ ఎరువును తప్పనిసరిగా వేయాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

దోమ ఆశించినప్పుడు థయోమిథాక్సామ్ 0.3 గ్రాములు లేదా మోనోక్రోటోఫాస్ 2.2 మిల్లీలీటర్లు లేదా అసిఫేట్ 1.5 గ్రాముల చొప్పున లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి. దోమ ఉధృతంగా వున్నప్పుడు మోనోక్రోటోఫాస్ 2.2 మిల్లీలీటర్లు లేదా డైక్లోరోవాస్ 1 మిల్లీలీటరు లేదా అసిఫేట్ 1.5 గ్రాములు మరియు డైక్లోరోవాస్ 1 మిల్లీలీటరు చొప్పున లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.

పిల్ల దోమలు మాత్రమే వున్నప్పుడు బుప్రోఫెజిన్ 1.5 మిల్లీలీటర్ల చొప్పున లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి. మొక్కల మొదళ్లు తడిచేటట్లు పిచికారీ చేయాలి.

పవర్ స్ప్రేయర్‌తో, పెట్రోలు పంపుతో పిచికారీ చేసేటప్పుడు ఎకరాకు 7–8 ట్యాంకుల మందునీరు సరిపోతుంది. కావున మందు మోతాదు లీటరు నీటికి 2 1/2 నుండి 3 రెట్లు పెంచుకోవాలి.



Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/12-14



# కొమ్మికి అభయ హస్తం!

పెంచలకోన ఆరగేట్రంలో మేకపాటి రాజమోహన్‌రెడ్డి తనకు టిక్కెట్ రాదని అన్యాపదేశంగా మాట్లాడాడని హైదరాబాదులోని జగన్ కార్యాలయంలో ఫిర్యాదు చేశాడు కొమ్మి లక్ష్మయ్యనాయుడు. వైఎస్.జగన్‌కు కళ్లు, చెవులు అని భావించే వైవి. సుబ్బారెడ్డిని, సజ్జల రామకృష్ణారెడ్డిని కలిసి తన మొర విన్పించాడు. వారిద్దరూ దాన్ని బాగానే ఆలకించారు. నాకు వెంకటగిరి కొత్త. ఎన్నికల లోపల అన్ని గ్రామాలలో నేను నిలదొక్కుకోవాలంటే నేనే అభ్యర్థిని అనే అభిప్రాయం కల్గించాలి. కానీ రాజ మోహన్‌రెడ్డి ప్రకటనల వల్ల అది వీలు కావడం లేదు. గ్రామాలకు వెళ్తే నీకు టిక్కెట్ వస్తుందనే గ్యారంటీ ఏమిటి అని ప్రశ్నిస్తున్నారని మొర పెట్టుకొన్నాడట కొమ్మి.

అయితే వైవి.సుబ్బారెడ్డి, సజ్జల రామకృష్ణారెడ్డిలిద్దరూ ఆయనకు గట్టి హామీ ఇచ్చారు. జగన్ మాట తప్పే మనిషి కాదు. ఒకసారి నీకు టిక్కెట్ అనే సూచన ఇచ్చిన తర్వాత అందులో మార్పు వుండదు. నిబ్బరంగా వెళ్లి నీ పని నువ్వు చేసుకో... అని నచ్చచెప్పి పంపించారు వారిద్దరూ.

మేకపాటి సమీప బంధువైన పాపకన్ను రాజశేఖర్‌రెడ్డి, మేకపాటి కంటే ముందు నుంచి రాజకీయాలలో వున్నవాడు. రాపూరు నియోజకవర్గంలో ఒకప్పుడు ఆయనదొక కీలక వర్గం. మాగుంట సుబ్బరామరెడ్డి బ్రతికి వున్నప్పుడు ఆయన్ను రాపూరు అభ్యర్థిగా నిలబెట్టాలనే ప్రయత్నం జరిగింది. మేకపాటి రాజ మోహన్‌రెడ్డి ఆ తర్వాత రాజకీయాలలోకి వచ్చినవాడు. ఇప్పుడు వైఎస్.జగన్ పార్టీకి జిల్లా పెద్దరికం మేకపాటిదే అనే భావన వుంది. నీకు స్వంతంగా అవకాశం వచ్చినప్పుడు కూడా మాకు అన్యాయం చేయడం ఏమిటని రుసరుస లాడుతున్నారు పాపకన్ను కుటుంబీకులు. కానీ జగన్ మాత్రం మేకపాటి మాట వినేట్లు కన్పడడం లేదు. నెల్లూరుజిల్లాలో ఒక కమ్మ అభ్యర్థికి టిక్కెట్ ఇవ్వడం అన్ని పార్టీలూ పాటించే సాంప్రదాయం. పైగా కొమ్మి, జగన్ మీద నమ్మకంతో చంద్రబాబును ఎదిరించి, నేరుగానే తూలనాడి తెలుగుదేశం నుంచి బయటకు వచ్చేశాడు. అందువల్ల కొమ్మికి అన్యాయం చేయలేనని జగన్ చెప్తున్నాడు. ఈ మధ్యలో నలిగిపోతున్నాడు పాపం మేకపాటి.







Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com